"ఓం శ్రీ పరమాత్మనే నమః "

మహర్షి బోధ

(200 ప్రశ్నోత్తర రూపములో)

ఆంగ్ల మూలము మహర్షీస్ గాస్పెల్

తెలుగు సేత దోనెపూడి వెంకయ్య

ఓం

శ్రీరమణాశ్రమము

తిరువణ్ణామలై – 606 603 2018
ప్రస్తావన

భక్తులు అపుడపుడు అడిగిన ప్రశ్నలకు, భగవాన్ శ్రీరమణ మహర్షి జవాబులు చెప్పేవారు. **వాటిలో కొన్ని 'శ్రీమహర్షి బోధ' (Maharshi's Gospel) అనే ఈ గ్రంథ రూపంలో ప్రచురింపబడ్డాయి. భగవాన్ భక్తులలో అనేక సంఖ్యాకుల అభీష్టం మేరకు, ఈ ముద్రణ జరిగింది. ఈ గ్రంథం అందరికీ ఉపయుక్తంగా ఉండగలదనేది దీని ఉద్దేశ్యం.

ఇందులోని ప్రశ్నలు, మనలో చాలామందికి ఎదురయ్యేవే. వాటి పరిష్కారం కోసం, మనలో మనం మథనపడుతూనే ఉంటాము. 'మహర్షి జవాబులు' వారి అపరోక్ష జ్ఞానాన్నీ, అనుభవాన్నీ ఆధారం చేసుకొని చెప్పినవి. ఇవి ఆధ్యాత్మిక జ్ఞాననిధులు. శ్రద్ధాళువైన సత్యాన్వేషకునకు ఈ జవాబులు అమూల్యములు.

“పరమాత్మ” అనగా బ్రహ్మము, ఏకమాత్రమైన సద్వస్తువు. ఇదే అద్వైత పరమార్థము. దీనిని గురించి ఈ గ్రంథములోని పుటలలోవలె, ఇంత తేటగా మరెక్కడా విశదపరిచినట్లు చూడము. దీనికి కారణం ఉంది. ఒకవైపు జిజ్ఞాసువులు, సామాన్య జనులు తమకు ఉండే వ్యావహారిక దృష్టికోణం నుండి సత్యాన్ని తెలుసుకోవాలని ప్రయత్నిస్తుంటే; మరోవైపు భగవాన్ శ్రీరమణులు, తమ నిరతిశయ ఆత్మానుభవ మూలంలో నిలిచి భాషిస్తుండేవారు.

'సత్యం' అందరికీ సమానమే. అందువలన జిజ్ఞాసువు అయినవాడు అంతరాంతరమైన తన ఆత్మానుభవాన్ని విచారించి, సూక్ష్మంగా పరిశీలించి, స్వాంతస్తత్త్వాన్ని (హృదయాన్ని తనకు తానై వెదకి) కనుగొనాలని భగవాన్ శ్రీరమణులు నిర్దేశించేవారు. 'హృదయం' కేవలమైన పరతత్త్వమునకు అభిన్నము. మనం చూసే, తెలుసుకునే సమస్తమూ ఆ పరతత్త్వములో తోచే దృగ్గోచర దృశ్యము మాత్రమే.

మహర్షి పెదవుల నుండి వెలువడిన ప్రతి పలుకు 'ఉపనిషత్ జ్ఞానసారము.' ఆ జ్ఞానముయొక్క పరమావతారము మహర్షి*.ఈ పుటలలో లభించే ఆచరణీయ ఉపదేశములద్వారా, శ్రద్ధాళువులైన పాఠకులకు, 'తమ నిజతత్త్వము దైవత్వమే' అనే నమ్మకం చిక్కుతుంది.

65వ పేజీలో శ్రీస్వామి సిద్ధేశ్వరానంద వ్యాసం చూడండి.

భగవద్భక్తుల కొరకు ఈ ప్రశ్నలను 'మారిస్ ఫ్రిడ్మన్' అనే భక్తుడు భగవాన్ను అడిగి, జవాబులు పొందినట్లు; మహర్షి స్వయంగా ఒక భక్తునితో ఈ విషయం చెప్పినట్లు ఆశ్రమములో జనశ్రుతి ఉన్నది.

విషయ సూచిక

ప్రథమ భాగము



ద్వితీయ భాగము



# మహర్షి బోధ మొదటి భాగము

## 1. కర్మ, సన్న్యాసము

భక్తుడు - ఆధ్యాత్మికానుభూతికి సంబంధించిన మహోన్నత లక్ష్యం మానవునికి ఏమిటి?

మహర్షి - ఆత్మసాక్షాత్కారం.

భ- వివాహితుడైన వ్యక్తి 'ఆత్మసాక్షాత్కారం' పొందగలడా?

మ- తప్పకుండా. వివాహితుడైనా, అవివాహితుడైనా ప్రతి మనిషీ ఆత్మను సాక్షాత్కరింపచేసుకోగలడు. ఎందుకంటే, 'ఆత్మ' ఇక్కడే, ఇపుడే వుంది. అలాగాక, అది ప్రయత్నంద్వారా ఎపుడో పొందవలసినదైతే, లేదా కొత్తగా సంపాదించు కోవలసింది అయితే, దానిని సాధించాలనుకోవడం వ్యర్థమే అవుతుంది. కారణం, సహజసిద్ధం కానిది శాశ్వతమైనది కూడా కాదు. ఆత్మ ఒక్కటే వుంది, ఇక్కడే ఇపుడే వుంది. నేను చెప్పేది ఇదే.

భ - సముద్రంలో మునిగిన ఉప్పుబొమ్మ, నీళ్ళకు తడవని తొడుగుతో, రక్షణ పొందదు. మేము రాత్రింబవళ్ళు పాటుపడవలసి వున్న ఈ లోకం, సముద్రం వంటిది.

మ - అవును. 'మనస్సే' నీళ్ళకు తడవని తొడుగు.

భ - అలా అయితే, మనిషి కర్మప్రవిష్టుడై వుంటూనే, కామనావర్జితుడై ఏకాంతాన్ని అనుభవించవచ్చునా? కానీ, బ్రతుకు బాధ్యతల కారణంగా దైవప్రార్థనకుగానీ, ధ్యానం చేసుకోవడానికిగానీ సమయమే దొరకడం లేదు.

మ- అవును. కామ్యబుద్ధితో చేసే 'కర్మ' బంధకారణం. కానీ, నిష్కామ భావనతో చేసే 'కర్మ' కర్తను బంధించదు. అటువంటివాడు కర్మలు చేస్తూ కూడా, ఏకాంతంలోనే వుంటాడు. విధి నిర్వహణమే “నిజమైన నమస్కారం", భగవన్నిష్ఠలో వుండడమే "నిజమైన ఆసనం."

భ - నేను గృహాన్ని త్యజించనవసరం లేదా?

మ- దైవయోగం నీకు అలా వుండి వుంటే, ఈ ప్రశ్న ఉత్పన్నమయ్యేదే కాదు.

భ - అయితే, మీరు చిన్నతనంలో ఇంటిని ఎందుకు వదలి వచ్చారు?

మ- ఈశ్వరాజ్ఞ లేనిదే ఏదీ జరుగదు. జీవితంలోని ఘటనాక్రమం, ప్రారబ్ధాన్ని బట్టి నిర్ధారింపబడుతుంది.

భ - నా సమయమంతా ఆత్మాన్వేషణకై వినియోగించడం మంచిదా? అది అసాధ్యమైతే, నేను ఊరికే మౌనంగా ఉండాలా?

మ - ఏ ఇతర తలపుల జోలికి పోక, నీవు ఊరికే వుండగలిగితే, అది మంచిదే. అది కుదరనపుడు, సాక్షాత్కార విషయంలో మాత్రమే ఊరక వుంటే, ప్రయోజనం ఎక్కడ వుంటుంది? నీవు కర్మబద్ధుడవై వున్నంత కాలమూ, ఆత్మ సాక్షాత్కారానికై యత్నాలు మానుకోవద్దు.

భ - నేను చేసే కర్మలు, వచ్చే జన్మలలో నాపై ప్రభావాన్ని చూపవా?

మ - ఇపుడు నీవు అసలు పుట్టావా? తరువాతి జన్మలను గురించి ఆలోచించడం దేనికి? 'అసలు పుట్టుక లేదు, చావు లేదు'. వున్న విషయం ఇది. ఎవడు పుట్టాడో వాడే చావు గురించీ, దాని పరిహారాన్ని గురించీ ఆలోచించాలి.

భ - మరణించినవారిని మాకు చూపగలరా?

మ - మీ బంధువులు వారు పుట్టకపూర్వం మీకు తెలుసా - వారి మరణానంతరం వారిని గురించి తెలుసుకునేందుకు?

భ - మోక్షంయొక్క కల్పనలో, గృహస్థుని స్థానం ఏమిటి? మోక్షప్రాప్తికోసం, అతడు విధిగా సన్న్యాసి కానక్కర్లేదా?

మ - 'నీవు గృహస్థుడవు' అని ఎందుకు భావించడం? నీవు సన్న్యాసివై వెళితే కూడా, ఇలాంటి తలపులే నిన్ను చుట్టుకొని వుంటాయి. గృహంలో వున్నా, గృహాన్ని విడిచి అరణ్యాలకు వెళ్ళినా; నీ మనస్సు సదా నీవెంట వుండనే వుంటుంది. 'అహంత'యే తలపులకు మూలం. దేహాన్నీ, లోకాన్నీ సృష్టించేది అదే. 'నీవు గృహస్థుడవు' అని భావించేలా చేసేది కూడా అదే. నీవు సన్న్యసిస్తే,కర్మ, సన్యాసము దానివల్ల 'గృహస్థుడవు అనే తలపుకు బదులు సన్న్యాసివి' అనే తలపు వుంటుంది. గృహ పరిసరాలకు బదులు అరణ్య పరిసరాలు వుంటాయి.

మనస్సులోని ప్రతిబంధకములు మాత్రం వీడిపోక, ఎప్పటికీ నీతో అలాగే వుంటాయి. కొత్త పరిసరాల్లో అవి ఇంకా ఎంతగానో ప్రబలమవుతాయి కూడా. కనుక పరిసరాలను మార్చినందువలన ప్రయోజనం లేదు. వున్న ఒకే ఒక ప్రతిబంధకం 'మనస్సు.' గృహంలో వున్నా, అరణ్యంలో వున్నా, ఆ మనస్సును నిర్జించాలి. ఆ పని నీవు అరణ్యంలో వుండి చేయగలిగితే, గృహంలో వుండి మాత్రం ఎందుకు చేయకూడదు? కనుక పరిసరాలను మార్చడం దేనికి? పరిసరాలు ఏవైనా, ఇపుడు కూడా నీ ప్రయత్నాలు నీవు చేయవచ్చు.

భ - లౌకిక వ్యవహారాలలో మునిగి వుంటూ కూడా, సమాధి ఆనందాన్ని పొందడం సాధ్యమవుతుందా?

మ - 'నేను చేస్తున్నాను' అనే తలపే ఆటంకం. 'చేసేది ఎవరు?" అని ప్రశ్నించుకో. 'నీవు ఎవర'వో జ్ఞప్తిలో వుంచుకో. అపుడు కర్మ నిన్ను బంధించదు. అది తనకు తానుగా సాగిపోతుంది. కర్మ చేయడానికి లేదా త్యజించడానికి ప్రయత్నం చేయవద్దు. నీ ప్రయత్నమే 'బంధం.'

దైవవిధి ప్రకారం జరిగేది జరుగుతుంది. నీవు పని చేయరాదని వ్రాసిపెట్టి వుంటే, ఎంతగా వెంపరలాడినా, చేసేందుకు నీకు పని వుండదు. నీవు పని చేయాలని వ్రాసిపెట్టి వుంటే, దానినుండి నీవు తప్పించుకోలేవు. బలవంతంగా అయినా దానిని చేయవలసి వస్తుంది. కనుక దానిని దైవానికి వదలివేయి. నీవు ఎంచుకున్న రీతిలో దేనినీ త్రెంచుకోనూ లేవు, వుంచుకోనూ లేవు.

భ - "లోపల' వున్న దైవాన్ని వెదకుటకు ప్రయత్నిస్తే, 'బయటి' పని తనకు తాను సాగిపోతుంద"ని భగవాన్ నిన్న సెలవిచ్చారు. శ్రీచైతన్యుని జీవితంలో ఒక ఘట్టం వుంది: "విద్యార్థులకు పాఠాలు చెప్పేటపుడు, యథార్థానికి చైతన్యుడు 'లోపల' వున్న కృష్ణుణ్ణి (ఆత్మను) పొందడానికి యత్నించేవాడు. దేహస్మృతి సైతం లేకుండా, ఆయన కృష్ణుని గురించి మాట్లాడుతుండేవాడు."

ఇక్కడ ఒక సందేహం కలుగుతోంది. "కర్మను దానిపాటికి దానిని వదలివేయవచ్చునా? లేక భౌతిక కర్మలపట్ల పాక్షిక గమనికను కలిగి వుండాలా?"

మ- ఆత్మయే అన్నీ. నీవు ఆత్మకు ఎడంగా వున్నావా? ఆత్మ లేకుండా కర్మ సాగుతుందా? ఆత్మ సర్వవ్యాపి, నీవు కర్మప్రవణుడవై కష్టపడినా, పడకపోయినా జరిగే పనులు జరుగుతాయి. పని తనంతట తాను సాగిపోతుంది. కృష్ణుడు అర్జునునికి చెప్పినది ఇదే: "అర్జునుడు కౌరవులను చంపడానికి ప్రయాసపడ- నవసరం లేదు. వారు అంతకుముందే దైవంచేత నిహతులైనారు."

కర్మాచరణకై సంకల్పం, దానిని గురించిన సంతాపం మొదలైనవాటితో అతనికి పని లేదు. 'దైవేచ్ఛను నెరవేర్చడంలో, తన స్వభావాన్ని నిమిత్తమాత్రం చేయడమే' అతని పని.

భ - పనిమీద దృష్టి వుంచకపోతే, ఆ పని భంగం కావచ్చు కదా!

మ- ఆత్మపై దృష్టి వుంచితే, పనిపై దృష్టి వుంచినట్లే. దేహంతో తాదాత్మ్యం చెందడం కారణంగా, 'పని చేసేది నేను' అని నీవు అనుకుంటున్నావు. కానీ దేహం, దాని క్రియాకలాపాలు, ఆ పనితోసహా ఆత్మను విడిచి లేవు. నీవు పనిపై దృష్టి వుంచితేనేమి, వుంచకపోతేనేమి?

ఉదాహరణకు నీవు ఒక ప్రదేశంనుండి మరొక ప్రదేశమునకు నడిచి వెళతావు. నీవు వేసే అడుగులపై నీ దృష్టి వుండదు. అయినా, కొంచెంసేపు గడిచిన తరువాత, గమ్యంవద్ద నీవు వున్నట్లు కనుగొంటావు. నీ దృష్టిని అటు పెట్టకపోయినా, గమన వ్యాపారం ఎలా సాగిపోతుందో, చూడు, తదితరములైన వివిధ కర్మల విషయం కూడా అంతే.

భ - అయితే ఇది నిద్రలో నడవడంలాంటిదా?

మ - నిద్రలో నడవడంలాంటిదనా? అవును. పసిపిల్లవాడు గాఢనిద్రలో వుండగా, తల్లి వానిచేత అన్నం తినిపిస్తుంది. పసివాడు అన్నం తింటాడు. బాగా మెలకువలో వున్నపుడు ఎలాగ తింటాడో, సరిగ్గా అలాగే. కానీ, మర్నాడు ఉదయం తల్లితో, "అమ్మా! రాత్రి నేను అన్నం తినలేదు" అంటాడు. తల్లికీ, ఇతరులకు 'పిల్లవాడు అన్నం తిన్నాడు' అని తెలుసు. పిల్లవాడు మాత్రం, 'తాను తినలేదు' అంటాడు. అతనికి జ్ఞప్తి లేదు. కానీ, పని మాత్రం జరిగిపోయింది.

బండిలో ప్రయాణీకుడు నిద్రపోతాడు. ఎద్దులు నడుస్తుంటాయి లేదా కదలకుండా నిలుచుని వుంటాయి లేదా ప్రయాణ సమయంలో వాటిని కాడికర్మ, సన్యాసము

నుండి విప్పుతారు. ఇవేవీ అతనికి తెలియదు. నిద్ర నుండి లేచేసరికి, తాను వేరేచోట వున్నట్లు గ్రహిస్తాడు. దారిలో జరిగిన సంగతులు ఏవీ తెలియక హాయిగా వుంటాడు. ప్రయాణం ఏమో పూర్తి అయింది. ఆత్మ విషయంలోనూ అంతే.

బండిలో నిద్రించే బాటసారి "నిత్యజాగ్రత్తు అయిన ఆత్మకు" ఉపమానం. ఎద్దులు నడవడం 'జాగ్రదావస్థ.' ఎద్దులు కదలక నిల్చి వుండడం 'సమాధి.' (ఎందుకంటే, 'సమాధి' అంటే జాగ్రత్ సుషుప్తి. అందులో మనిషి ఎరుకలో వుంటాడు. కానీ కర్మలపట్ల అనాసక్తుడై వుంటాడు. ఎద్దులు కాడికి కట్టి వుంటాయి. కానీ కదలవు). ఎద్దులను కాడినుండి విప్పడం 'నిద్ర.' అప్పుడు క్రియాకలాపాలన్నీ - ఎద్దులను కాడినుండి విప్పినప్పటిలాగా పూర్తిగా ఆగిపోతాయి.

అలాగే, సినిమా దృష్టాంతాన్ని తీసుకో. సినిమా ప్రదర్శనలో తెరమీద దృశ్యాలు చూపిస్తారు. కదిలే దృశ్యాలవల్ల తెరపై ఏ ప్రభావమూ పడదు, ఏ మార్పూ రాదు. ప్రేక్షకుని దృష్టి వుండేది దృశ్యాలమీద. తెరమీద కాదు. అయితే దృశ్యాలు తెరను వీడి వుండలేవు. కానీ, తెరను ఉపేక్షిస్తాడు. 'ఆత్మ'యే తెర. అందులోనే దృశ్యాలు, క్రియాకలాపాలు మొదలైనవి సాగుతుంటాయి. వీటి గురించిన ఎరుకయే మనిషికి వుంటుంది. 'సారభూతమైన ఆత్మ' అనే తెరను గురించి వుండదు. ఏమైనా సరే, దృశ్యప్రపంచం ఆత్మకు భిన్నంగా లేదు. తెర (ఆత్మ)ను తెలుసుకున్నా, తెలియకపోయినా కర్మలు సాగిపోతుంటాయి.

భ - సినిమా ప్రదర్శనను నిర్వహించేందుకు ఒక కర్త వుంటాడు! మ - 'సినిమా' జడవస్తువులతో నిర్మింపబడుతుంది. దీపం, చిత్రం, తెర మొదలైనవి అన్నీ జడములు. అందువల్ల వాటిని నడిపించే చేతన కర్త ఒకడు వుండాలి. ఆత్మ కేవల చైతన్యము. కనుక స్వయంసిద్ధము. ఆత్మకు అన్యంగా కర్త వుండే వీలు లేదు.

భ - 'దేహమే కర్త' అని నేను భ్రాంతి చెందడం లేదు. గీత 18వ అధ్యాయంలోని 61వ శ్లోకాన్ని నేను పేర్కొంటున్నాను:

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి | భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ||

మ - 'శరీరంద్వారా జరిగే పనులకు ఒక చాలకుడు అవసరం' అనేది దృష్టిలో పెట్టుకొని చెప్పిన మాట అది. దేహం జడము. కనుక దానికి చేతనుడైన ఒక కర్త వుండాలి. జనులు 'తాము జీవులము అనుకొంటారు కనుక "ఈశ్వరుడు హృదయంలో వుండి జీవులను ఆడిస్తాడు "అని శ్రీకృష్ణుడు చెప్పాడు. వాస్తవానికి జీవులు లేరు. చెప్పాలంటే తదన్యంగా చాలకుడూ లేడు. ఆత్మలోనే అన్నీ ఇమిడి వున్నాయి.

ఆత్మయే తెర, చిత్రాలు, ద్రష్ట, చాలకుడు, వెలుగు, చిత్రశాల మొదలైనవన్నీ. 'నీ దేహాన్ని ఆత్మగా' భ్రమించడం, 'నీవే కర్తవు' అని భావించడం - ఇది ప్రేక్షకుడు, తాను సినిమాలోని నటుడను అని రూపించడంవంటిది. 'తెర లేకుండా తాను ఒక దృశ్యంలో పాత్రను పోషిస్తాను' అనే నటుడిని ఊహించుకో! 'తన కర్మలు ఆత్మకు భిన్నములు' అని తలచే మనిషి సంగతి కూడా అలాంటిదే.

భ - ఇంకో పక్షంలో, ఇది 'ప్రేక్షకుడిని సినిమా దృశ్యంలో నటించమ'ని చెప్పడం వంటిది. అయితే మేము నిద్రలో నడవడం నేర్చుకోవాలి!

మ- ఏ క్రియ అయినా, ఏ దశ అయినా నీ దృష్టినిబట్టి వుంటుంది. కాకి, ఏనుగు, పాము ఇవి ఒకే అవయవాన్ని రెండు పనులకు మార్చిమార్చి వుపయోగిస్తాయి. ఒకే కంటితో కాకి ఆ ప్రక్కకూ, ఈ ప్రక్కకూ చూస్తుంది. ఏనుగుకు తొండమే చెయ్యిగాను, ముక్కుగాను వుపయోగపడుతుంది. పాము కళ్ళతో చూస్తుంది, వింటుంది కూడా. కాకికి ఒక కన్నే వున్నది అన్నా, రెండు కళ్ళు ఉన్నాయన్నా; ఏనుగు తొండాన్ని చెయ్యి అన్నా, ముక్కు అన్నా; పాము కళ్ళను చెవులు

అని పిలిచినా భావం ఒకటే. జ్ఞాని విషయంలో కూడా "సుషుప్తి జాగ్రత్, జాగ్రత్ సుషుప్తి, స్వప్న సుషుప్తి, స్వప్న జాగ్రత్" ఇలా ఏ విధంగా అన్నా తేడా ఏమీ లేదు.

భ - కానీ, మేము భౌతికమైన జాగ్రత్ ప్రపంచంలో వున్న ఈ భౌతిక శరీరంతో వ్యవహరించవలసి వుంది. పని సాగుతుండగా నిద్రపోతే, లేక నిద్రపోతూ పని చేయాలని చూస్తే పని తారుమారు పడుతుంది.

మ- 'నిద్ర' మరపు కాదు. అది నీ శుద్ధస్థితి! 'జాగ్రత్' ఎరుక కాదు. అది మరపు. నిద్రలో పూర్తి ఎరుక వుంది, జాగ్రత్తులో పూర్తి మరపు వుంది. నీకర్మ, సన్యాసము నిజతత్త్వం ఈ రెండింటిలోను వ్యాపించి వుంది. వాటిని మించికూడా వుంది. 'ఆత్మ' ఎరుక, మరపులకు అతీతమైనది. నిద్ర, స్వప్నము, జాగ్రత్తు ఈ అవస్థలు ఆత్మసన్నిధిలో వచ్చిపోయే వృత్తులు మాత్రమే. నీకు వాటి గురించి ఎరుక వున్నా, లేకపోయినా అవి జరిగిపోతుంటాయి.

ప్రయాణీకుడు నిద్రపోతుంటే, ఎద్దులు నడుస్తుంటాయి లేదా కదలక నిల్చుంటాయి లేదా కాడినుండి విప్పబడతాయి. అదే రకంగా, జ్ఞానదశలో సమాధి, జాగ్రత్తు, స్వప్నం, నిద్ర ఈ అవస్థలు వచ్చిపోతుంటాయి. జ్ఞానియొక్క స్థితి ఇది. జవాబులు అజ్ఞానియొక్క దృష్టికోణం నుండి చెప్పినవి. లేకుంటే ఈ ప్రశ్నలే తలెత్తవు.

భ - సరే ... అవి ఆత్మకు తలెత్తవు. అడిగేందుకు అక్కడ ఎవరు వుంటారు? కానీ, దురదృష్టం ఏమిటంటే, నాకు ఇంకా ఆత్మసాక్షాత్కారం కాలేదు.

మ- సరిగ్గా అదే నీ దారికి అడ్డము. 'నేను అజ్ఞానిని, నేను ఇంకా ఆత్మ సాక్షాత్కారాన్ని పొందాలి' అనే తలపును నీవు వదల్చుకోవాలి. నీవు ఆత్మవే. ఆ ఆత్మను నీవు ఎరుగని క్షణం అంటూ వుందా?

భ - అయితే, మేము నిద్రలో నడిచే ప్రయోగం చేయాలి. లేదా పగటి కలలతోనా?

మ - (నవ్వు)

భ - నా అభిప్రాయంలో, ఎడతెగని తీవ్రధ్యానం వలన, సమాధిలో మునిగి వున్న వ్యక్తియొక్క భౌతిక శరీరం, దాని కారణంగా చలనరహితంగా వుంటే వుండవచ్చు. అది క్రియాశీలంగాను వుండవచ్చు లేదా నిష్క్రియంగాను వుండవచ్చు. సమాధిలో కుదురుకొన్న మనస్సుపై, దేహేంద్రియ వ్యాపారముల ప్రభావం వుండదు. ఒకవేళ మనస్సులో అలజడి వుంటే, అది శరీరంయొక్క కార్యశీలతకు సూచకం కాదు కూడ.

అయితే మరొక వ్యక్తి చెప్పేది వేరుగా వుంది: "శరీరం క్రియాశీలంగా వుంటే అది సమాధినీ, అఖండ ధ్యాననిష్ఠనూ ఆటంకపరుస్తుంది" అని అతడు అంటాడు. దీనిపై భగవాన్ అభిప్రాయం ఏమిటి? నేను చెప్పిన మాటకు మీరే పరమ ప్రమాణం.

మ - మీరిద్దరు చెప్పింది కూడ యుక్తమే. నీవు 'సహజ నిర్వికల్ప సమాధి'ని గురించి చెప్పావు. అతడు 'కేవల నిర్వికల్ప సమాధి'ని గురించి చెప్పాడు. రెండవ దానిలో 'మనస్సు' ఆత్మతేజస్సులో మునిగి వుంటుంది. (కానీ, గాఢనిద్రలో 'మనస్సు' అజ్ఞాన తమస్సులో లీనమై వుంటుంది). ఈ సమాధినుండి మేల్కొన్న వ్యక్తి సమాధికీ, కార్యశీలతకు మధ్య భేదాన్ని చూస్తాడు. అంతేగాక, కేవల నిర్వికల్ప సమాధి పొందగోరే సాధకునకు శారీరక క్రియాశీలత, దృకావ్యాపారం, ప్రాణ సంచారం, మనఃప్రవృత్తి, విషయ గ్రహణం మొదలైనవి ప్రతిబంధకాలు అవుతాయి. 'సహజ సమాధి'లో అయితే, మనస్సు ఆత్మలో లీనమై నశించిపోతుంది. పైన చెప్పిన భేదాలు, ప్రతిబంధకాలు అక్కడ వుండవు. ఇటువంటి వ్యక్తియొక్క కార్యకలాపాలు - నిద్రమత్తులో వున్న బాలుడిని అన్నం తినిపించినట్లుగా - వుంటాయి. అవి చూసేవారికి గోచరిస్తాయిగానీ ఆ వ్యక్తికి కాదు. నడుస్తున్న బండిలో నిద్రపోయే ప్రయాణీకుని 'మనస్సు' తమస్సులో మునిగి వుండడం వలన, బండియొక్క కదలిక తెలిదు. అయితే, చిదానంద అనుభవ పారవశ్యంలో మునిగి, మనస్సు నశించిన 'సహజ జ్ఞాని'కి తన శరీర వ్యాపారాలను గురించిన ఎరుకే వుండదు.

గమనిక:- 'నిద్ర, కేవల నిర్వికల్ప సమాధి, సహజ నిర్వికల్ప సమాధి' వీటి మధ్య గల వ్యత్యాసాన్ని భగవాన్ సెలవిచ్చిన విధంగా, ఒక పట్టిక రూపంలో తేటగా వివరించవచ్చు.

నిద్ర

కేవల నిర్వికల్ప సమాధి

1. మనస్సు సచేతనం.

1. మనస్సు సచేతనం.

2. తమస్సులో మగ్నం.

2. తేజస్సులో మగ్నం. ఉదా: త్రాడుకు చేదకట్టి, బావిలోని నీటిలో వదలినట్లు.

సహజ నిర్వికల్ప సమాధి

1. మనస్సు మృతం.

2. ఆత్మలో విలీనం.

ఉదా: నది సముద్రంలో చేరి, తన ఉనికిని కోల్పోయినట్లు.

త్రాడుయొక్క అవతలి కొనను పట్టుకొని పైకి లాగవచ్చు.

నదిని సముద్రంలో నుండి వెనుకకు మళ్ళించలేము.
మౌనము, ఏకాంతము ఆత్మసాక్షాత్కారం పొందిన జ్ఞానియొక్క 'మనస్సు' పూర్తిగా నశిస్తుంది. అది మృతము, 'జ్ఞాని' చూసేవారికి సామాన్య వ్యక్తివలె, మనస్సు వున్నవానివలె తోచవచ్చును. అందువలన, జ్ఞానిలోని 'నేను'కు కేవలం వున్నట్లు కనిపించే ఒక వస్తుగత సత్యత్వం మాత్రమే వుంటుంది. అయితే, దానికి నిజానికి వ్యక్తిగత సత్తాగానీ, వ్యక్తిగత సత్యత్వంగానీ లేవు.

## 2. మౌనము, ఏకాంతము

భక్తుడు - 'మౌనవ్రతం' ఉపయుక్తంగా వుంటుందా?

మహర్షి - అంతరంగ మౌనమే ఆత్మసమర్పణం. అది అహంకార రహితంగా జీవించడం.

భ - సన్న్యాసికి 'ఏకాంతం' అవసరమా?

మ - 'ఏకాంతం' మనిషి మనస్సులో వుంటుంది. ఒకడు జనం మధ్యలో వుండి కూడా, కొరత లేని మనశ్శాంతిని నిలబెట్టుకోవచ్చు. అటువంటివానికి ఎపుడూ ఏకాంతమే. ఇంకొకడు. అడవిలో వున్నా, మనస్సును నిగ్రహించుకోలేకపోవచ్చు. అటువంటివాడు “ఏకాంతవాసి" అని చెప్పలేము. “ఏకాంతం” అనేది ఒక మనో వైఖరి. లౌకిక విషయాసక్తునికి ఎక్కడ వున్నా, ఏకాంతం లభించదు. నిరాసక్తుడు ఎపుడూ ఏకాంతవాసియే.

భ - 'మౌనం' అంటే ఏమిటి?

మ- వాక్కు, మనసులకు అతీతమైన స్థితియే “మౌనం." అది మనోవ్యాపారం లేని ధ్యానం. మనోదమనము 'ధ్యానం.' ప్రగాఢ ధ్యానం నిత్యప్రసంగము. ‘మౌనం’ సదా సాగే సంభాషణ. అది నిరంతర భాషాస్రవంతి. మాటల వలన దానికి విఘాతము ఏర్పడుతుంది. మాటలు ఈ మౌనభాష'ను అడ్డుకొంటాయి. వుపన్యాసాలు గంటల తరబడి శ్రోతలకు వీనులవిందు చేసినా, అవి వారిని బాగుపరచలేకపోవచ్చు. మౌనం మాత్రం శాశ్వతమైనది. అది మానవాళి అంతటికి మేలు ఒనగూర్చుతుంది. 'మౌనం' అనగా వాగ్ధాటి అనే అర్థం. వాగ్రూపములు అయిన వుపన్యాసాలు, మౌనంవలె అనర్గళంగా వుండవు. 'మౌనం' ఆగని వాక్ ప్రవాహం అది శ్రేష్ఠమైన భాష. ఒక స్థితిలో మాటలు ఆగిపోతాయి, మౌనం రాజ్యమేలుతుంది.

భ - అలా అయితే, మన తలపులను ఒకరికొకరు తెలియపరచుకోవడం ఎలాగ?

మ- దాని అవసరం ద్వైతభావం వున్నపుడే

భ - భగవాన్ బయలుదేరి వెళ్ళి, ప్రజానీకానికి సత్యమును గురించి ఎందుకు బోధించరు?

మ - 'నేను అది చేయటం లేద'ని నీకు ఎలా తెలుసు? వేదిక ఎక్కి చుట్టూ వున్న జనులకు బల్ల గ్రుద్ది వుపన్యాసాలు చెపితేనే, బోధించినట్లు అవుతుందా? 'బోధించడం' అంటే కేవలం జ్ఞానాన్ని అందించడం. మౌనంద్వారా మాత్రమే నిజానికి అది సాధ్యం. ఒక వ్యక్తి గంటసేపు ఒక ప్రవచనాన్ని వింటాడు, లేచి వెళ్ళిపోతాడు. కానీ, అది అతని మనస్సులో నాటుకోకపోవచ్చు, అతని జీవితాన్ని మార్చలేకపోవచ్చు. దీని గురించి ఏమంటావు?

అదే, మరొక వ్యక్తి ఒక పవిత్ర సన్నిధిలో కూర్చొని, కొంతసేపు వుండి వెళ్ళిపోతాడు. దానితో జీవితంపట్ల అతని దృక్పథం పూర్తిగా మారిపోతుంది. ఈ ఇద్దరి సంగతిని పోల్చి చూడు. వీటిలో ఏది మంచిది? 'కంఠశోషగా బోధించడమా? లేదా మౌనంగా కూర్చొని అంతశ్శక్తి ప్రసారం చేయడమా?'

మరొక విషయం. మాటలు ఎలా పుడతాయి? కేవలమైన జ్ఞానం వుంది. అందులోనుండి 'అహంత', అహంత నుండి 'తలపు', తలపు నుండి 'మాటలు' వుదయిస్తాయి. అనగా మూలస్థానానికి 'మాట' మునిమనుమడు. మాటలు ప్రభావాన్ని చూపగలిగినపుడు, నీవే ఆలోచించు, మౌనంద్వారా చేసే వుపదేశం ఇంకా ఎంత ఎక్కువ శక్తివంతంగా వుండాలి? కానీ శాశ్వతం, నిత్యసిద్ధం, దైనందినం, సరళం అయిన ఈ నగ్నసత్యాన్ని జనం గ్రహించరు. ఈ సత్యం ఆత్మ సంబంధి. ఆత్మను ఎరుగనివాడు ఎవడైనా వున్నాడా? కానీ, జనులు ఈ సత్యాన్ని గురించి వినేందుకు సైతం ఇష్టపడరు. అవతల ఏముందో దాని గురించీ; స్వర్గం, నరకం, పునర్జన్మ వీటి గురించి తెలుసుకోవాలని ఆత్రంగా వుంటారు.

జనులకు మర్మములైన విషయాలపై మక్కువ ఎక్కువ. అంతేగానీ సత్యంపై కాదు. మతాలు వారి అవసరాలు తీరుస్తాయి. అది కూడా చివరకు వారిని మనోనిగ్రహము ఆత్మవైపుకు మరల్చేందుకే! నీవు ఎంచుకున్న మార్గం ఏదైనా, చిట్టచివరకు నీవు ఆత్మ వద్దకు తిరిగి రావలసిందే, తప్పదు. అటువంటపుడు, ఇపుడే ఇక్కడే నీవు ఆత్మనిష్ఠలో ఎందుకు వుండకూడదు? పరలోకాలను చూసేందుకుగానీ, లేదా పరలోకాల గురించి విచారణ చేయడానికిగానీ ఆత్మ వుండడం తప్పనిసరి. అందువల్ల అవి ఆత్మకు భిన్నమైనవి కావు. అజ్ఞానిసైతం విషయాలను చూస్తున్నపుడు, చూసేది ఆత్మనే.

## 3. మనోనిగ్రహము

భక్తుడు - నేను మనస్సును నిగ్రహించడం ఎలా?

మహర్షి - ఆత్మసాక్షాత్కారం అయితే, నిగ్రహించేందుకు మనస్సు లేదు. మనస్సు అదృశ్యమైనపుడు, ఆత్మ తానుగా వెలుగుతుంది. సాక్షాత్కారం కలిగిన వ్యక్తిలో మనస్సు క్రియాశీలంగా వున్నా, నిష్క్రియంగా వున్నా, వుండేది ఆత్మ ఒక్కటే. మనస్సు, దేహం, లోకం ఇవి ఆత్మకు భిన్నమై లేవు. ఆత్మను వీడి అవి వుండలేవు. అవి ఆత్మకంటే ఇతరమైనవి ఎలా అవుతాయి? ఆత్మను ఎరిగినవానికి, ఛాయా మాత్రములైన వీటి గురించి చింత ఎందుకు? అవి ఆత్మను ఎలా ప్రభావితం చేస్తాయి?

భ - మనస్సు ఛాయా మాత్రమే అయితే, ఆత్మను ఒకడు తెలుసుకోవడం ఎలా?

మ - హృదయమే ఆత్మ. అది స్వయం ప్రకాశకము. తేజస్సు, హృదయం నుండి లేచి మెదడు చేరుతుంది. మెదడు మనస్సుకు స్థానం. నీవు మనస్సుద్వారా లోకాన్ని చూస్తావు. అంటే ఆత్మతేజః ప్రతిఫలనముద్వారా లోకాన్ని చూస్తావు. లోకం గ్రహింపబడేది మనోవ్యాపారముద్వారానే. మనస్సు ప్రకాశితమైనపుడు లోకాన్ని తెలుసుకుంటుంది, ప్రకాశితం కానపుడు లోకాన్ని తెలుసుకోలేదు.

మనస్సు లోనికి అనగా తేజోమూలము వైపుకు మరలితే, విషయ జ్ఞానం ఆగిపోతుంది. ఆత్మ మాత్రమే హృదయంగా ప్రకాశిస్తుంది.

సూర్యకాంతి ప్రతిఫలించి, చంద్రుడు ప్రకాశిస్తాడు. సూర్యుడు అస్తమించి నపుడు, వస్తువులు కనిపించేందుకు చంద్రుడు వుపకరిస్తాడు. సూర్యుడు వుదయిస్తే, చంద్రబింబం ఆకాశంలో కనిపించినప్పటికీ, చంద్రుడు ఎవరికీ అవసరం లేదు. మనస్సు, హృదయం వీటి సంగతి ఇంతే. మనస్సు తన పరావర్తిత కాంతి వలన వుపయోగపడుతోంది. దాని సాయంతో వస్తువులను చూస్తాము. లోనికి తిరిగినపుడు, అది తన తేజోమూలంలో లీనమవుతుంది. ఆ మూలం స్వయం ప్రకాశకమైనది. మనస్సు, అపుడు పగటి చంద్రునిలాగ వుంటుంది.

చీకటిగా వున్నపుడు, వెలుతురుకై దీపం వుండాలి. సూర్యుడు వుదయిస్తే, దీపం అక్కర్లేదు. అపుడు వస్తువులు కనిపిస్తాయి. అయితే సూర్యుడిని చూసేందుకు, దీపం అక్కర్లేదు. నీ కళ్ళను, స్వయంజ్యోతి అయిన ఆ సూర్యునివైపు తిప్పితే చాలు. అలాగే, మనస్సు విషయంలో కూడా. వస్తువులను చూసేందుకు, మనస్సు నుండి ప్రతిఫలించిన వెలుగు కావాలి. హృదయాన్ని చూసేందుకు, మనస్సును దానివైపు తిప్పితే చాలు. అప్పుడు మనస్సు నిస్తేజమవుతుంది. హృదయం స్వయంప్రకాశ స్వరూపం.

భ - అక్టోబరులో ఆశ్రమాన్ని వీడిన తరువాత, శ్రీభగవాన్ సమక్షంలో వెల్లివిరిసే ఆ సన్నిధి ప్రభావం, సుమారు పదిరోజుల వరకు నన్ను చుట్టుకొని వున్నట్లు తోచేది. ఎల్లవేళలా, నేను పనిలో మునిగి వున్నంతసేపు, ఏకత్వములోని శాంతి నాలో అంతర్వాహినిగా వుండేది. అది ఒకవైపు పసలేని ప్రసంగం వింటూ, రెండోవైపు కునికిపాట్లు తీసేవాని ద్వివిధ చేతనమా అన్నట్లు వుండేది. అంతట అది కూడా మొత్తం క్రమంగా అంతరించిపోయింది. ప్రతిగా గతంలోని జాడ్యాలన్నీ మళ్ళీ వచ్చి కూర్చున్నాయి. ప్రత్యేకంగా ధ్యానం చేసుకుందామంటే, పని వత్తిడి వలన ఖాళీ సమయం దొరకదు. పని చేసుకుంటూ 'నేను వున్నాను' అని నన్ను నేను నిరంతరం జ్ఞప్తికి తెచ్చుకుంటుంటే సరిపోతుందా?

మ- (కొంత విరామం తరువాత) నీవు మనస్సును దృఢం చేసుకుంటే, శాంతి ఎల్లపుడూ కొనసాగుతుంది. దాని అవధి నిరంతర అభ్యాసంద్వారా పొందిన నీ మనోదార్ఢ్యానికి అనురూపంగా వుంటుంది. దృఢమైన మనస్సు, శాంతి ప్రసారాన్ని పట్టి నిలిపి వుంచగలుగుతుంది. అటువంటి స్థితిలో కర్మరతుడవు అయినా, కర్మవిరతుడవు అయినా శాంతిప్రసరణం అబాధితమై, నిరాటంకంగా వుంటుంది. ప్రతిబంధకం కర్మ కాదు, 'ఆ కర్మను చేసేది నేనే' అనే భావన.

## మనోనిగ్రహము

భ - మనోదార్ఢ్యానికి నిర్ణీతమైన ధ్యానం అవసరమా?

మ - అవసరం లేదు. 'కర్మ నాది కాదు' అనే భావనను ఎపుడూ నీవు నిలుపుకుంటే, దానిని జ్ఞప్తియందు వుంచుకొనడానికి, మొదట్లో ప్రయత్నం అవసరం అవుతుంది. తరువాత అది సహజమై అవిచ్ఛిన్నంగా వుంటుంది. కర్మ దానంతట అదే సాగిపోతుంది. నీలో శాంతి సుస్థిరంగా నెలకొంటుంది. నీ నిజతత్త్వం ధ్యానమే.

ఇతరమైన తలపులు నిన్ను కలవర పెడుతున్నాయి కనుక, దానిని నీవు ఇపుడు 'ధ్యానం' అని పిలుస్తున్నావు. ఈ తలపులను పారద్రోలితే, నీవు ఒక్కడవే మిగులుతావు. అనగా తలపులు లేని ధ్యానస్థితిలో నిలుస్తావు. అదే నీ నిజతత్త్వం. ఇతర తలపులను త్రోసివేసి, దానినే నీవు ఇపుడు పొందాలని ప్రయత్నిస్తున్నావు. అలా ఇతర తలపులను త్రోసివేయడమే, ఇపుడు 'ధ్యానం' అని పేర్కొనబడుతుంది. అభ్యాసం దృఢమైతే, నిజతత్త్వమే నిజమైన ధ్యానంగా ప్రకటమవుతుంది.

భ - ధ్యానం చేయుటకు ప్రయత్నించగానే, ఇతర తలపులు మరింత ప్రబలంగా ముసరికొంటాయే!

మ - అవును! ధ్యాన సమయంలో అన్ని రకాలైన తలపులు చెలరేగుతాయి. అది వాస్తవమే. లోపల దాగి వున్నదంతా, బయటకు వస్తుంది. అది పైకి రాకపోతే, దానిని రూపుమాపటం ఎలా? తలపులు తమంతట తామే లేచినట్లు పైకి లేస్తాయి. క్రమంగా అణగారిపోయేందుకే అలా లేస్తాయి. తద్వారా మనోదృఢత్వాన్ని కలుగజేస్తాయి.

భ - మనుషులు, వస్తువులు కలలో మాదిరిగా అస్పష్టంగా, ఇంచుమించు పారదర్శక రూపాలుగా గోచరించే కొన్ని సమయాలు వుంటాయి. వాటిని బాహ్యమైనవిగా గమనించడం మానుకుంటాము. అయితే వస్తు మాత్రములుగా వాటి గురించిన ఎరుక వుంటుంది. కర్త రూపంగా ఏ విధమైన వ్యక్తిత్వ స్ఫురణ వుండదు. మనస్సులో ఒక గంభీర ప్రశాంతత నెలకొంటుంది. ఆత్మలో మునుగుటకై సన్నద్ధులమయ్యే క్షణాలు అవేనా? లేదా అది ఆత్మ సమ్మోహన పర్యవసానమైన అవాంఛనీయ స్థితి అవుతుందా? తాత్కాలికమైన శాంతిని ఇచ్చేందుకు దోహదంగా వుంటుంది కనుక ఇది ప్రోత్సహించదగిందా?

మ- మనస్సులోని ప్రశాంతతతో కలిసి చైతన్యం వుంది. సరిగ్గా ఇదే లక్ష్యంగా పెట్టుకోవలసిన స్థితి. అయితే 'అదే ఆత్మ' అని అనుభవంలోకి తెచ్చుకోకుండా, ఈ అంశంపై ప్రశ్నను రూపొందించడం చూస్తే, ఈ స్థితి ఆకస్మికమేగానీ స్థిరమైనది కాదని కనిపిస్తూనే వుంది.

బహిర్ముఖములైన వాసనలు వుంటే, 'మునుగుట' అనే మాట సముచితమైనదే. అటువంటి స్థితిలో మనస్సును మళ్ళించి లోపలికి త్రిప్పితే, అది బాహ్యార్థ వుపరితలం నుండి లోపలికి మునుగుతుంది. నీ చైతన్యానికి అవరోధమే లేకుండా ప్రశాంతత నెలకొని వుంటే, మునగడం దేనికి? 'ఆ స్థితియే ఆత్మ' అని అనుభవంలోకి రాకపోతే, అందుకోసం చేసే ప్రయత్నాన్ని 'మునుగుట' అని పేర్కొనవచ్చు. ఈ దృష్ట్యా అది 'సాక్షాత్కారానికి లేదా మునగడానికి' అనుకూలమైన స్థితి అని చెప్పవచ్చు. కాబట్టి నీవు వేసిన చివరి రెండు ప్రశ్నలకు తావు లేదు.

భ - మనస్సులో పసిబిడ్డల పట్ల ప్రత్యేకాభిమానం వుంటూనే వుంది. బహుశ పసివారి రూపాన్ని, ఆదర్శానికి ప్రతీకలుగా వుదహరించడం వల్లనేమో! ఈ విశేష ఆదర భావనను అధిగమించడం ఎలా?

మ- ఆత్మను పట్టుకొని వుండు. పసిబిడ్డలను గురించి, వారిపట్ల నీ ప్రతిస్పందనలను గురించి ఎందుకు ఆలోచించడం?

భ - తిరువణ్ణామలైకి ఈ నా మూడవ యాత్ర, నాలోని అహంభావాన్ని ఇంకా పెంచిందేమో అనిపిస్తోంది. ధ్యానం నాకు ఇపుడు కష్టమవుతోంది. ఇది ఏమంత పట్టించుకోనవసరం లేని, వచ్చిపోయే దశమాత్రమేనా? లేదా నేను ఇకనుండి ఇలాంటి ప్రదేశాలను వర్జించాలా?

మ - ఇదంతా మనస్సు కల్పించినది. ఈ ప్రదేశంగానీ, ఇంకొకటిగానీ నీలోనే వుంది. నీవు ఇటువంటి ఊహలు మానుకోవాలి. స్థలాలకూ, నీ మనో వ్యాపారాలకూ సంబంధమే లేదు. పైగా, నీ పరిసరాలు వ్యక్తిగతమైన నీ ఎంపికకు సంబంధించినవి కాదు. అవి సహజంగా, అలా వున్నాయి. నీవు వాటికి అతీతంగా వుండాలి. వాటిలో చిక్కుబడకూడదు.

(భగవాన్ లేచి కొండపైకి వెళ్ళిన తరువాత, ఎనిమిదిన్నర సంవత్సరాల బాలుడు ఒకడు, సాయంకాలం అయిదు గంటల ప్రాంతంలో, హాలులోకి వచ్చి కూర్చున్నాడు. భగవాన్ పరోక్షంలో ఆ బాలుడు యోగాన్ని గురించి, వేదాంతాన్ని గురించి శుద్ధసరళ గ్రాంధిక తమిళంలో మాట్లాడాడు. మహాత్ముల సూక్తులను, శాస్త్రవాక్యాలను ధారాళంగా ఉదహరిస్తూ మాట్లాడాడు. ముప్పావు గంట గడిచాక, భగవాన్ హాలులోకి వచ్చారు. అంతట నిశ్శబ్దం అలుముకొంది. ఇరవై నిమిషాలు, ఆ బాలుడు భగవాన్ సన్నిధిలో కూర్చున్నాడు. అప్పుడు ఒక్క మాట కూడా మాట్లాడలేదు. కేవలం భగవాన్ వంక కన్ను ఆర్పకుండా చూస్తున్నాడు. అతని కళ్ళవెంట నీరు కారింది. ఎడమ చేత్తో కన్నీరు తుడుచుకొని, "తాను ఇంకా మోక్షార్థినే" అంటూ వెంటనే అక్కడ నుండి వెళ్ళిపోయాడు).

భ - ఈ బాలునిలోని అసాధారణ లక్షణాలను ఎలా అర్థం చేసుకోవాలి?

మ - పూర్వజన్మ సంస్కారాలు అతనిలో బలీయంగా వున్నాయి. అయితే ఎంత బలవత్తరమైనవి అయినా, అవి ప్రశాంతమైన మనస్సులోనేగానీ ప్రకటం కావు. మనం దేనిని అయినా జ్ఞప్తికి తెచ్చుకొనేందుకు ఎంతగా ప్రయత్నించినా, ఒక్కొక్కపుడు ప్రయోజనం వుండదు. మనస్సు ప్రశాంతంగా ఏ కదలిక లేకుండా వుంటే, అదే హఠాత్తుగా స్ఫురిస్తుంది. ఇది అందరి అనుభవంలో వున్న విషయమే.

భ - ఎదురు తిరిగే మనస్సును శాంతింపచేయడం ఎలా?

మ - మనోమూలాన్ని చూడు. మనస్సు మాయమవుతుంది. లేదా నిన్ను నీవు అర్పించుకో, అపుడు మనస్సు అణగద్రొక్కబడుతుంది. 'ఆత్మసమర్పణ' అన్నా, 'ఆత్మజ్ఞానం' అన్నా ఒక్కటే. రెండింటి తాత్పర్యమూ తప్పనిసరిగా మనోనిగ్రహమే. ఒక ఉన్నత శక్తిని గుర్తించినపుడు మాత్రమే, అహంత లొంగుతుంది.

భ - మనస్సును అశాంతిమయం ఒనర్చడానికి నిజమైన కారణం, ఈ సంసారమే అనిపిస్తోంది. దీనిలో నుండి బయటపడడం ఎలా? మనశ్శాంతిని పొందేందుకు, సన్న్యాసమే సరైన సాధనం కాదా?

మ - సంసారం నీ మనస్సులోనే వుంది. 'ఇదిగో, ఇక్కడ నేను వున్నాను, నేను ప్రపంచాన్ని' అని ప్రపంచం వచ్చి నీతో చెప్పదు. అలా చెప్పి వుంటే, అది శాశ్వతంగా వుంటుంది. నీ నిద్రలో కూడా దాని ఉనికి నీకు తెలుస్తుంది. కానీ, నిద్రలో అది నీకు లేదు. కనుక అది అశాశ్వతం. అశాశ్వతం కావడం వలన దానికి సత్త్వము లేదు.

ఆత్మకు భిన్నంగా దానికి సత్యత్వం లేనందున, అది ఆత్మద్వారా సులువుగా అణచబడుతుంది. ఆత్మ ఒక్కటే శాశ్వతమైనది. "సన్న్యాసం" అంటే, ఆత్మను అనాత్మ అని అనుకోకుండా వుండడం. 'ఆత్మను అనాత్మ' అని భావించే అజ్ఞానం తొలగిపోతే, అనాత్మ లేకుండా పోతుంది. అదే నిజమైన “సన్న్యాసం.”

భ - అటువంటి సన్న్యాసం లేకుండానే, అనాసక్తితో కర్మలు చేయవచ్చునా?

మ- ఆత్మజ్ఞాని మాత్రమే సరైన కర్మయోగి కాగలడు.

భ - భగవాన్ ద్వైత దర్శనాన్ని ఖండిస్తారా?

మ - ఆత్మను అనాత్మగా భావించినపుడే, ద్వైతం నిలువగలుగుతుంది. అటువంటి తాదాత్మ్య భావన లేకపోవడమే “అద్వైతం.”

## 4. భక్తి, జ్ఞానము

భక్తుడు - "అందరినీ భగవంతుని స్వరూపులుగా దర్శించి, అందరికీ మ్రొక్కడంద్వారా, కృష్ణుడిని హృదయంలో కనుగొనాల”ని శ్రీభాగవతంలో చెప్పబడింది. ఆత్మసాక్షాత్కారానికి దారితీసే సరైన మార్గం ఇదేనా? మనస్సుకు అతీతమైనదానిని, “నే నెవడను?" అనే మానసిక విచారణద్వారా అన్వేషించడం కంటే; మనస్సుకు గోచరించే ప్రతిదానిలోను, ఇలా భగవంతుడిని ఆరాధించడం సులభం కాదా?

మహర్షి - అవును. అందరిలో భగవంతుడిని చూసినపుడు, నీవు భగవంతుడి గురించి ఆలోచిస్తావా లేదా? 'నీ చుట్టూ భగవంతుడిని దర్శించాలంటే, నీవు తప్పకుండా భగవంతుడి గురించే ధ్యానించాలి. నీ మనస్సులో భగవంతుడినే నిలుపుకోవడం “ధ్యానం.” సాక్షాత్కారానికి పూర్వదశ ధ్యానం. ఆత్మను సాక్షాత్కారం పొందేది ఆత్మలో. అది ఆత్మను వీడి వుండనే వుండదు. దానికి పూర్వం వుండేది ధ్యానమే. నీవు ధ్యానం చేసేది భగవంతుడిని అయినా, ఆత్మను అయినా అది ముఖ్యం కాదు.

ఎందుకంటే, రెండింటి లక్ష్యమూ ఒక్కటే. నీవు ఏ విధంగానూ ఆత్మనుండి తప్పించుకోలేవు. అందరిలో భగవంతుడిని చూడాలనుకుంటూ, నీవు ఆ భగవంతుడిని నీలో చూడవా? అందరూ భగవంతుడే అయితే, ఆ అందరిలో కలిసి నీవు లేవా? నీవు భగవంతుడివి అయితే, అందరూ భగవంతుడు కావడంలో ఆశ్చర్యం ఏముంది? శ్రీభాగవతంలోగానీ, మరోదానిలోగానీ బోధింపబడిన పద్ధతి ఇదే. అయితే, ఈ సాధనలో కూడా 'ద్రష్ట లేక ధ్యాత' అంటూ ఒకరు వుండాలి. అతడు ఎవరు?

భ - సర్వవ్యాపి అయిన దైవాన్ని చూడడం ఎలా?

మ- 'దైవాన్ని చూడడం' అంటే దైవంగా వుండడమే. దైవం వ్యాపించి వుండేందుకు, ఆయనను వీడి 'సర్వం' వేరేగా లేదు. ఆయన ఒక్కడే వున్నాడు.

భ - మేము అపుడపుడు గీతను పఠించాలా?

మ- ఎల్లపుడూ.

భ - జ్ఞానానికి, భక్తికి వున్న సంబంధం ఏమిటి?

మ- శాశ్వత, అఖండ, సహజ ఆత్మనిష్ఠయే “జ్ఞానము.” ఆత్మనిష్ఠుడవై వుండాలంటే, నీవు ఆత్మను ప్రేమించాలి. 'భగవంతుడు' అంటే నిజానికి ఆత్మయే. కనుక ఆత్మప్రేమయే భగవత్ ప్రేమ. అదే “భక్తి.” జ్ఞానం, భక్తి రెండూ ఈ విధంగా ఒక్కటే.

భ - ఒక గంటసేపు లేదా ఇంకా ఎక్కువసేపు నామజపం చేస్తున్నపుడు, నాకు నిద్రలాంటి స్థితి ముంచుకొస్తుంది. మెలకువ రాగానే, 'నా జపానికి విఘ్నం ఏర్పడింద'ని గుర్తు వస్తుంది. అపుడు మరల ప్రారంభిస్తాను.

మ- 'నిద్రలాంటిది' అనే మాట సరైనది. నీవు అహంతతో కూడి వున్నందున సహజ స్థితిని, నీ పనికి అంతరాయం కలిగించేదిగా భావిస్తున్నావు. 'అదే నీ సహజ స్థితి' అని స్పష్టంగా గుర్తించేవరకు, నీవు ఆ అనుభవాన్ని పునరావృతం చేసుకోవాలి. అపుడు 'జపం నీకు బాహ్యమైనది' అని గ్రహిస్తావు. అయినా ఆ జపం తనంతట తానుగా కొనసాగుతుంది. ఇప్పటికీ నీ సంశయం, ఆ మిథ్యా తాదాత్మ్యం వల్లనే. జపం చేస్తున్న మనస్సుతో, నీవు తాదాత్మ్యం చెందుతున్నావు. "జపం” అంటే, ఇతర తలపులన్నింటినీ త్రోసివేసి, ఒకే తలపును పట్టుకొని వుండడం. దాని ఉద్దేశ్యం అదే. అది ధ్యానానికి దారి తీస్తుంది. 'ధ్యానం' ఆత్మసాక్షాత్కారంలో లేక జ్ఞానంలో ముగుస్తుంది.

భ - నామ జపాన్ని నేను ఎలా కొనసాగించాలి?

మ- భక్తిభావం లేకుండా భగవన్నామాన్ని యాంత్రికంగా, నామమాత్రంగా వినియోగించకూడదు. భగవన్నామ ఉచ్చారణతో ఆయనను ఆర్తితో వేడుకోవాలి. ఆయనకు నిన్ను నీవు సంపూర్ణంగా సమర్పించుకోవాలి. అటువంటి శరణాగతి అనంతరమే, భగవన్నామం నిన్ను వీడకుండా వుంటుంది.

భ - అటువంటపుడు 'విచారం' యొక్క ఆవశ్యకత ఏముంది?

మ - 'నిజమైన శరణాగతి' అంటే ఏమిటో తెలుసుకొని, అటువంటి సమ్యక్ జ్ఞానంతో శరణాగతి చెందితేనే, అది ఫలవంతమవుతుంది. 'జ్ఞానం' విచార మననాల ద్వారా లభిస్తుంది. అది అనివార్యంగా, ఆత్మసమర్పణగా పర్యవసిస్తుంది. మనోవాక్కాయ కర్మలద్వారా భగవంతునికి చేసే సంపూర్ణ శరణాగతికి, జ్ఞానానికి తేడా లేదు. శరణాగతి సంపూర్ణమైనదిగా వుండాలంటే, అది నిస్సందిగ్ధంగా వుండాలి. భక్తుడు భగవంతుడితో బేరమాడలేడు. భగవంతుడిని 'అది కావాలి, ఇది కావాలి' అని కోరలేడు. అటువంటి సర్వస్వార్పణంలోనే సమస్తమూ ఇమిడి వుంది. అదే "జ్ఞానం," అదే "వైరాగ్యం," అదే "భక్తి," అదే "ప్రేమ."

భక్తుడు - సముద్రంలో కలిసిన నదులు తమతమ ప్రత్యేకతలను కోల్పోయినట్లుగా; ఒక మనిషి మరణించగానే, పునర్జన్మ అనేది లేకుండా, అతని అస్తిత్వం నశించదా? మహర్షి - కానీ, 'నీళ్ళు' ఆవిరై వర్షంగా కొండలపై కురిసి, మళ్ళీ నదుల రూపంలో ప్రవహించి, సముద్రంలోకి వచ్చి పడతాయి. 'జీవులు' సుషుప్తిలో తమ ప్రత్యేకతను కోల్పోయినా, మళ్ళీ తమ సంస్కారాలను అనుసరించి,ఆత్మ, జీవుడు జీవులుగానే తిరిగి వస్తారు. మరణంలో కూడా అంతే. సంస్కారాలతో కూడి వున్న మనిషియొక్క వ్యక్తిత్వం నశించదు.

భ - అది ఎలా?

మ- చూడు. కొమ్మలు నరకివేసినా, చెట్టు మరల పెరుగుతుంది. 'వ్రేళ్ళు' దెబ్బ తినకుండా వున్నంత కాలమూ, చెట్టు పెరుగుతూనే వుంటుంది. అలాగే మరణించినపుడు, 'సంస్కారాలు' హృదయంలో అణగి వుంటాయి. అందువల్ల నశించవు. అవే తగిన సమయంలో, పునర్జన్మకు కారణభూతమవుతాయి. జీవులు మరల జన్మించేది ఆ విధంగానే.

భ - హృదయంలో అణగి వున్న సూక్ష్మ సంస్కారాల వలన 'అసంఖ్యాకంగా వున్న ఈ జీవరాశులు, వాటితో సంబంధం గల విశాల విశ్వం' ఎలా పుట్టుకొని వస్తున్నాయి?

మ- అణువంత బీజంలో నుండి, అంత పెద్ద మర్రిచెట్టు పుట్టి వచ్చినట్లు; జీవ సముదాయం, నామరూపాత్మకమైన ఈ విశాల విశ్వమూ 'బీజప్రాయంగా వున్న సంస్కారముల' నుండి వుద్భవిస్తున్నాయి.

భ - పరమాత్మలో నుండి జీవాత్మ ఎలా వచ్చింది? అది తిరిగి పరమాత్మను చేరుకోవడం ఎలా సాధ్యపడుతుంది?

మ- అగ్నిలో నుండి స్ఫులింగము లేచినట్లు; పరమాత్మలో నుండి జీవుడు కలుగుతున్నాడు. స్ఫులింగాన్ని 'జీవుడు' అంటారు. అజ్ఞాని విషయంలో అయితే, అహంత లేస్తూనే, ఏకకాలంలో ఏదో ఒక విషయంతో తాదాత్మ్యం చెందుతుంది. విషయాలతో అటువంటి కూడిక లేకుండా, దానికి ఉనికి లేదు. ఈ కలయికకు కారణం అజ్ఞానం. అజ్ఞాన నాశమే నీ సాధనల పరమార్థం. విషయములతో తాదాత్మ్యం చెందే ఈ వాసనను నిర్మూలిస్తే, అహంత శుద్ధమవుతుంది. అంతట తన మూలంలో లీనం అవుతుంది. దేహంతో నీకు వున్న మిథ్యా తాదాత్మ్యమే, 'దేహాత్మబుద్ధి', 'దేహమే నేను' అనే తలపు. సత్ఫలితాలు కలగాలంటే ఇది పోవాలి.

భ - దానిని నేను నిర్మూలించడం ఎలా?

మ- సుషుప్తిలో నీవు దేహంతోను, మనస్సుతోను కలవకుండా వున్నావు. తక్కిన రెండు అవస్థలలో, నీవు వాటితో కలిసే వున్నావు. నీవు దేహంతో ఒకటైతే, సుషుప్తిలో దేహం లేకుండా ఎలా వుండగలిగావు? నీకు బాహ్యమైన దానినుండే నీవు వేరు కాగలవు. నీతో ఒకటైనదానితో వేరు కాలేవు. కనుక 'అహంత' దేహంతో ఒకటి కావడానికి వీలు లేదు. జాగ్రదావస్థలో దీనిని అనుభవంలోకి తెచ్చుకోవాలి. ఈ జ్ఞానం పొందడం కోసమే, అవస్థాత్రయాన్ని అధ్యయనం చేయడం.

భ - రెండు అవస్థలకు పరిమితమైన అహంత, మూడు అవస్థలలోను వ్యాప్తమైన దానిని సాక్షాత్కరింప చేసుకోవడానికి పూనుకోగలదా?

మ - రెండు అవస్థల మధ్య లేదా రెండు తలపుల మధ్య గల తెరపిలో, 'అహంత' శుద్ధ రూపంలో అనుభవంలోకి వస్తుంది. కీటకం తాను పట్టుకొన్న ఆధారాన్ని, మరొకదానిని పట్టుకొన్న తరువాతనే వదలిపెడుతుంది. 'అహంత' కూడా అలాంటిదే. విషయములతోగానీ, తలపులతోగానీ సంపర్కం లేకుండా వున్నపుడు, దాని నిజస్వభావం తెలుస్తుంది. జాగ్రత్, స్వప్న, సుషుప్తి రూప అవస్థాత్రయ అధ్యయన ప్రాప్తమైన నమ్మికద్వారా, ఈ అంతరమే "నిశ్చల, నిర్వికార సత్తత్త్వం" అనీ, అదే నీ "స్వస్వరూపం" అనీ నీవు సాక్షాత్కరించుకోవాలి.

భ - జాగ్రదావస్థలో వుంటున్న మాదిరి నా ఇష్టానుసారం, ఇష్టమైనంత కాలం నేను సుషుప్తిలో వుండిపోలేనా? ఈ మూడవస్థలలో జ్ఞానియొక్క అనుభవం ఏమిటి?

మ - సుషుప్తి నీ జాగ్రదావస్థలో కూడా వుండనే వుంది. ఇప్పుడు సైతం నీవు సుషుప్తిలోనే వున్నావు. జాగ్రదావస్థలోనే ఎరుకతో లోనికి వెళ్ళి, దానిని చేరుకోవాలి. లోపలికి వెళ్ళడం, బయటకు రావడం అంటూ నిజానికి ఏమీ లేదు. జాగ్రదవస్థలో సుషుప్తిని ఎరిగి వుండడమే, "జాగ్రత్ సుషుప్తి". అదే "సమాధి."

అజ్ఞాని సుషుప్తిలో ఎక్కువకాలం వుండలేడు. స్వభావరీత్యా, అతను బలవంతంగా అందులోనుండి బయటికి నెట్టివేయబడతాడు. అతనిలో అహంత నశించకపోవడం వలన, అది మరల మరల పైకి లేస్తుంది. కానీ, జ్ఞాని అహంతను, దాని మూలంలోనే అణచివేస్తాడు. అయితే 'ప్రారబ్ధ ప్రచోదితమా?" అన్నట్లు, అతనిలో కూడా అహంత అప్పుడపుడు పైకి లేచినట్లు తోచవచ్చు.ఆత్మ, జీవుడు అంటే అజ్ఞానికివలె, జ్ఞానికి కూడా ప్రారబ్ధ బలం వలన అహంత కొనసాగి, వ్యవహారం నిమిత్తం నిలిచి వున్నట్లు పైకి తోచవచ్చు.

ఇందులో మౌలికమైన ఒక బేధం వుంది. అజ్ఞానిలో అహంత తలెత్తినపుడు, (వాస్తవానికి అది అణగి వుంటుంది. సుషుప్తిలో తప్ప), దానికి తన మూలాన్ని గురించిన ఎరుక వుండదు. మరో మాటలో, అజ్ఞాని జాగ్రదావస్థలోను, స్వప్నావస్థలోను తన సుషుప్తిని ఎరుగడు. కానీ, జ్ఞాని విషయం అందుకు భిన్నం. జ్ఞానిలో 'అహంత' తలెత్తడం లేదా నిలిచి వుండడం, బయటకు చూసేందుకు మాత్రమే. జ్ఞాని లక్ష్యం ఎపుడూ తన మూలంపైనే వుంటుంది. అహంత తలెత్తినట్లు, నిలిచి వున్నట్లు తోచినా; జ్ఞాని అఖండ పారమార్థికానుభవ ఆనంద మగ్నుడై వుంటాడు. ఈ అహంత నిరపాయమైనది, కాలిన త్రాడువంటిది; రూపం వున్నా, అది దేనిని బంధించేందుకు పనికి రాదు. దృష్టిని నిరంతరం మూలస్థానంపై నిలిపి వుంచడం వలన - ఉప్పుబొమ్మ సముద్రంలో కలిసి పోయినట్లుగా అహంత ఆ మూలంలోనే విలీనమై పోతుంది.

భ - శిలువ వేయడంలోని ప్రాధాన్యం ఏమిటి?

మ - 'దేహమే' శిలువ. మానవ కుమారుడైన క్రీస్తు 'అహంత' లేదా 'దేహాత్మ భావన.' మానవ కుమారుడు శిలువపై కొరత వేయబడినపుడు, అహంత నశిస్తుంది, పరతత్త్వం మిగులుతుంది. అది ఈశ్వర కుమారుడు, క్రీస్తు పవిత్రాత్మ యొక్క పునరుత్థానము.

భ - 'కొరత వేయడం' ఏ విధంగా న్యాయోచితం? 'చంపడం' ఘోరమైన నేరం కాదా?

మ- ప్రతివాడు 'ఆత్మ' హత్యకు పాల్పడుతూనే వున్నాడు. ఈ అజ్ఞానమయ జీవితం, నిత్యానందమయ సహజ స్థితిని అణచివేస్తోంది. ఈ రకంగా, వర్తమాన జీవిత శాశ్వత సత్ స్వరూపమును హత్య చేయడమే. యథార్థానికి ఇది 'ఆత్మ' హత్య ఉదంతం కాదా? ఇక హత్య మొదలైనవాటి గురించిన విచారం ఎందుకు?

భ - "నిర్వికల్ప సమాధి, ఇరవై ఒక్క రోజులకు మించి కొనసాగద"ని శ్రీరామకృష్ణులు చెప్పారు. “ఇంకా విడువకుండా సాగిస్తే, ఆ వ్యక్తి మరణిస్తాడు” అన్నారు. ఇది వాస్తవమేనా?

మ - ప్రారబ్ధ క్షయానంతరం, 'అహంత' పూర్తిగా నశించిపోతుంది. దాని జాడ కూడా ఏదీ మిగులదు. అదే "నిర్వాణం." ప్రారబ్ధంక్షయం కాకపోతే జీవన్ముక్తులలో ఛాయామాత్రంగా తోచినట్లు, అహంత మరల తలెత్తుతుంది.

## 6. ఆత్మసాక్షాత్కారం

భక్తుడు - నేను ఆత్మసాక్షాత్కారాన్ని పొందేది ఎలా?

మహర్షి - 'సాక్షాత్కారం' అనేది క్రొత్తగా పొందేది కాదు. అది ఇంతకుముందు నుండి వున్నదే. చేయవలసినదంతా ఒక్కటే. ‘నాకు సాక్షాత్కారం కాలేదు' అనే తలపును వదల్చుకోవాలి.

నిశ్చలత్వం లేదా శాంతియే “సాక్షాత్కారం.” ఆత్మ లేని క్షణమే లేదు. 'సాక్షాత్కారం కాలేదు' అనే తలపు లేదా సందేహం ఎంతవరకు వుంటుందో, అంతవరకు ఈ తలపులను వదల్చుకొనేందుకు ప్రయత్నం చేయవలసి వుంటుంది. ఈ తలపుకు కారణం, ఆత్మ అనాత్మతో తాదాత్మ్యం చెందడమే. అనాత్మ అదృశ్యమైతే, ఆత్మ ఒక్కటే మిగులుతుంది. ఖాళీ ఏర్పడాలంటే, ఇరుకును తొలగిస్తే చాలు. గదిని ఎక్కడి నుండీ తీసుకొని రారు.

భ - వాసనాక్షయం కానిదే, సాక్షాత్కారం సాధ్యం కాదు. కాబట్టి, వాసనలు సమూలంగా నిర్మూలింపబడిన స్థితిని, నేను సాక్షాత్కరింప చేసుకోవడం ఎలా?

మ - నీవు ఇపుడు ఆ స్థితిలోనే వున్నావు!

భ - విడువక ఆత్మనిష్ఠలో వుండి, వాసనలు ఎప్పుడు తల ఎత్తితే, అపుడు నిర్మూలించాలని దీని భావమా?

మ- నీవు వున్నవాడవు వున్నట్లు అనగా నీ సహజ స్థితిలో వుంటే, వాసనలు వాటంతట అవే నశిస్తాయి.

భ - నేను ఏ విధంగా ఆత్మను చేరుకోగలను?

మ- 'ఆత్మను చేరుకోవడం' అనేది లేదు. ఆత్మ చేరుకోవలసినది అయితే, ఆత్మ ఇక్కడ ఇపుడు లేదని, దానిని ఇంకా పొందవలసి వున్నదనీ అర్థం వస్తుంది. కొత్తగా పొందేది అయితే, అది పోగొట్టుకొనేది కూడా అవుతుంది. అంటే, అది ఆత్మసాక్షాత్కారం అనిత్యమైనది అవుతుంది. అనిత్యమైనదానికోసం అర్రులు చాచుట దండగ. అందుచేతనే నేను చెప్పేది, 'ఆత్మను చేరడం అనేది లేదు.' నీవు ఆత్మవే. నీవు ఇంతకుముందే 'అది'గా వున్నావు.

నీ ఆనంద స్వరూపమును గురించి, నీకు మరపు ఏర్పడింది. యథార్థం ఇది. అజ్ఞానం అవరోధమై, ఆనందరూపమైన శుద్ధాత్మను కప్పివేస్తుంది. ‘అజ్ఞానం” అంటే, విపరీత జ్ఞానమే. ఈ అజ్ఞానపు తెరను తొలగించేందుకే, సాధనలన్నీ, మనస్సు, శరీరములతో ఆత్మకు వున్న మిథ్యా తాదాత్మ్యమే “విపరీత జ్ఞానం.” ఈ మిథ్యా తాదాత్మ్యం తొలగిపోవాలి. అపుడు ఆత్మ ఒక్కటే మిగిలి వుంటుంది. కాబట్టి, సాక్షాత్కారం అందరికీ వున్నదే. అది ముముక్షువులను వేరువేరుగా సంభావించదు. 'నేను సాక్షాత్కారం పొందగలనా?' అనే సందేహం, 'నాకు సాక్షాత్కారం కాలేదు' అనే భావన, ఇవే ఆటంకాలు. ఈ ఆటంకాల నుండి కూడ నీవు విముక్తుడవు కావాలి.

భ - సమాధియొక్క ప్రయోజనం ఏమిటి? సమాధిలో తలపులు మిగిలి వుంటాయా?

మ - సమాధి మాత్రమే సత్యాన్ని దర్శింప చేయగలుగుతుంది. తలపులు పరమాత్మను కప్పివేస్తాయి. అందువలన సమాధిలో తప్ప, తక్కిన అవస్థలలో అది అదిగా సాక్షాత్కరించదు.

సమాధిలో 'నేను వున్నాను' అనే భావం మాత్రమే వుంటుంది. తలపులు వుండవు. 'నేను వున్నాను అనే అనుభవం' అంటే, నిశ్చలుడవై వుండడమే.

భ - నేను ఇక్కడ పొందే సమాధి అనుభవాన్ని లేదా నిశ్చలతనూ ఎలా పునరావృతం చేసుకోగలను?

మ- ఇప్పటి నీ అనుభవం, నీవు ఇపుడు వున్న వాతావరణ ప్రభావం వలన కలిగినట్టిది. ఈ పరిసరాలకు బయట నీవు దీనిని పొందగలవా? ఈ అనుభవం వచ్చిపోయేది. ఇది స్థిరపడేవరకు అభ్యాసం అవసరం.

భ - సమస్తాన్ని తనలో ఇముడ్చుకొని, సామాన్యాత్మకు బయట ఎక్కడో కేంద్రాన్ని కలిగినట్టి చిత్రకాశ ప్రభలు ఒక్కొక్కపుడు తళుక్కుమంటు వుంటాయి. తాత్త్విక విషయాల జోలికి పోకుండా, అరుదైన ఇటువంటి చిత్రప్రభా స్ఫురణమును పొందడానికి, నిలిపి వుంచుకోవడానికి, పొడిగించుకోవడానికి చేసే సాధన విషయంలో భగవాన్ సలహా ఏమిటి? ఇటువంటి అనుభవాలకై చేసే అభ్యాసం నివృత్తితో కూడినదా?

మ- బయట! 'లోపల, బయట అనేవి ఎవరికి?' ఇవి ద్రష్ట, దృశ్యములు వున్నంత వరకే వుంటాయి. అయితే, ఈ రెండూ మరల ఎవరికి? విచారణ చేసినట్లైతే, అవి ద్రష్టయందే అంతరించిపోతాయని నీవు గ్రహిస్తావు. ద్రష్ట ఎవరో చూడు. ఈ విచారణ, నిన్ను ద్రష్టకు అతీతమైనే శుద్ధ చైతన్యమువైపు తీసుకెళుతుంది.

సామాన్య ఆత్మ 'మనస్సు.' ఈ మనస్సు పరిమితులకు లోనైంది. శుద్ధచిత్తు పరిమితులకు ఆవలది. విచారణ ద్వారా పైన చెప్పిన రీతిలో దానిని చేరుకోవచ్చు.

పొందటం - ఆత్మ ఎపుడూ వున్నదే. నీవు చేయవలసింది ఒక్కటే. ఆత్మ ప్రకటనకు అడ్డుగా నిలిచిన ఆవరణాన్ని విచ్ఛేదం తొలగించాలి.

నిలిపి వుంచుకోవడం - నీవు ఆత్మను సాక్షాత్కరింప చేసుకుంటే, అది నీకు నిత్యశుద్ధ అపరోక్షానుభూతిగా వుంటుంది, అది ఎపుడూ పోగొట్టుకొనబడలేదు.

పొడిగించడం - ఆత్మను పొడిగించడం అనేది లేదు. వ్యాకోచ, సంకోచ రహితమై నిత్యమూ అది వున్నట్లు వుంది.

ఏకాంతవాసం - ఆత్మనిష్ఠయే "ఏకాంతవాసం." ఆత్మకు అన్యమై ఏదీ లేదు. 'ఏకాంతవాసం' అనేది ఒక చోటు నుండి మరొక చోటుకు లేదా ఒక స్థితి నుండి మరొక స్థితికి ఆత్మను వీడి ఒకటీ లేదు, మరొకటీ లేదు. అన్నీ ఆత్మ అయి వుండగా, ఏకాంతవాసం అసంభవం, అనూహ్యం.

అభ్యాసం - అంతర్గత శాంతికి భంగకరమైనవాటిని నిరోధించడమే "అభ్యాసం." అభ్యాసం చేసినా, చేయకపోయినా నీవు ఎపుడూ నీ సహజ స్థితిలోనే వున్నావు. ఏ ప్రశ్నలూ లేకుండా, ఏ సందేహాలకు తావీయకుండా, నీవు వున్నవాడవు వున్నట్లు వుండడమే "నీ సహజ స్థితి."

భ - సమాధి సిద్ధించినవానికి సిద్ధులు లభిస్తాయా?

మ- సిద్ధులు ప్రదర్శించాలంటే, వాటిని గ్రహించేందుకు అన్యులు వుండాలి. అంటే సిద్ధులు ప్రదర్శించేవాటిలో జ్ఞానం లేదని అర్థం. కాబట్టి సిద్ధులను గురించి ఆలోచించడం వ్యర్థం. జ్ఞానం ఒక్కటే లక్ష్యభూతంగా వుండదగింది, పొందదగింది.

భ - నా సాక్షాత్కారం ఇతరులకు సాయపడుతుందా?

మ - అవును. సాయపడుతుంది. ఇతరులకు, బహుశ నీవు చేయగలిగే గొప్ప సహాయం అదే. గొప్ప గొప్ప సిద్ధాంతాలు కనుగొన్నవారంతా, వాటిని తమ అంతరంగపు లోతుల్లో కనుగొన్నారు. కానీ, వాస్తవానికి నీవు సాయపడేందుకు 'ఇతరులు' అంటూ ఎవరూ లేరు. అనేక రకాల బంగారు నగలకు విలువ కట్టేటపుడు, కంసాలి వాటిలోని బంగారాన్నే చూసినట్లుగా; ఆత్మసిద్ధుడు అంతట ఆత్మనే చూస్తాడు. నీవు దేహంతో తాదాత్మ్యం చెందినపుడు, నామరూపాలు వుంటాయి. అదే, నీవు దేహాత్మబుద్ధిని అధిగమిస్తే, నీకు ఆ 'ఇతరులు' లేకుండా పోతారు. జ్ఞాని జగత్తును తనకు భిన్నమైనదిగా చూడడు.

భ - మహాత్ములు ఇతరులతో కలసి వుంటే, మేలు జరుగుతుంది కదా?

మ- కలిసి వుండేందుకు 'ఇతరులు' లేరు. ఆత్మ ఒక్కటే సత్స్వరూపం.

భ - కష్టాల్లో వున్న జనులను నేను ఆదుకోవడానికి ప్రయత్నించవద్దా?

మ- ఏ శక్తి నిన్ను సృష్టించిందో, అదే శక్తి ఈ లోకాన్ని కూడా సృష్టించింది. ఆ శక్తి నీ బాగోగులు చూడగలిగినపుడు, లోకం బాగోగులు కూడా చూడగలదు. భగవంతుడు జగత్తును సృష్టిస్తే, ఆ జగద్రక్షణ భారం కూడా ఆయనదే. నీది కాదు.

భ - దేశభక్తులుగా వుండడం మా ధర్మం కాదా?

మ - నీ ధర్మం 'వుండటం.' ఇదిగానో, అదిగానో వుండటం కాదు. 'నేను నేనుగా వున్నాను' అనేది సత్యమంతటినీ కలిసి సారాంశంగా చెప్పిన మాట. అందుకై మార్గం సంగ్రహంగా “నిశ్చలంగా వుండు' అనేది.

“నిశ్చలంగా వుండటం" అంటే 'నిన్ను నశింపచేసుకో' అని అర్థం. ఎందుకంటే, ప్రతినామం, ప్రతిరూపం ఇవే దుఃఖానికి కారణం. 'నేను, నేను' అంటే ఆత్మ. 'నేను ఇది' అంటే అహంత. 'నేను'ను 'నేను'గానే నిలుపుకుంటే, అదే ఆత్మ. దీనిని వదలిపెట్టి, తటాలున వేరే దారిలోకి వెళ్ళి, 'నేను ఇది' లేదా 'నేను ఫలానా' అని చెపితే, అదే అహంత.

భ - అయితే “దైవం” అంటే ఎవరు?

మ - ఆత్మయే దైవం. 'నేను వున్నాను' అనేది దైవం. దైవం ఆత్మకంటే భిన్నమైతే, ఆ దైవం ఆత్మ లేనివాడై వుండాలి. అది అసంగతం. కనుక ఆత్మను సాక్షాత్కరించు కొనేందుకు చేయవలసిందల్లా ఒకటే, 'నిశ్చలంగా వుండటం. దీనికంటే సులభమైనది ఏముంటుంది? అందుకే, ఆత్మవిద్యాప్రాప్తి అత్యంత సులభం.

## 7. గురువు, గురువు అనుగ్రహము

భక్తుడు - "గురుకృప” అంటే ఏమిటి? ఆత్మసాక్షాత్కారానికి అది ఎలా దారి చూపిస్తుంది?

మహర్షి - గురువు అంటే ఆత్మ. ఒక్కొక్కప్పుడు మనిషి, జీవితంలో అసంతృప్తికి గురి అవుతాడు. అతడు తనకు వున్నదానితో తృప్తి చెందడు. దైవప్రార్థన మొదలైన వాటిద్వారా, తన కోరికలు నెరవేర్చుకోవాలనుకుంటాడు. తద్వారా, అతని మనస్సు క్రమంగా పవిత్రమవుతుంది. అతడు దైవాన్ని గురించి తెలుసుకోవాలనుకుంటాడు. ఐహిక వాంఛలను తృప్తి పరచుకోవడంకంటే, అతనిలో ఇపుడు దైవకృపను పొందాలన్న తపన పెరుగుతుంది. అంతట 'దైవకృప' అభివ్యక్తం కావడం ప్రారంభిస్తుంది. భగవంతుడు గురువు రూపంలో భక్తునికి దర్శనం ఇస్తాడు. సత్యాన్ని గురించి బోధ చేస్తాడు.

తన సాన్నిధ్య మహిమచేత, అతని మనస్సును ప్రక్షాళనం చేస్తాడు. భక్తుని మనస్సు బలం పుంజుకొని, అంతర్ముఖం అయ్యేందుకు యోగ్యం అవుతుంది. ధ్యానం వలన అది మరింత శుద్ధమై, శాంతమై, ఈషణ్మాత్ర స్పందన అయినా లేకుండా వుండిపోతుంది. ప్రశాంతమైన ఆ చైతన్యాకాశమే (ఎరుక) ఆత్మ.

గురువు 'బయట,' 'లోపల' కూడా వుంటాడు. అంతర్ముఖం అయ్యేందుకు, ఆయన మనస్సును బయట నుండి లోపలికి ఒక త్రోపు తోస్తాడు. ఆత్మ సన్నిధికి చేరేందుకు, మనస్సును లోపలికి ఒక గుంజు గుంజుతాడు. అలా మనస్సుకు గురువు, గురువు అనుగ్రహము, శాంతి, చేకూర్చుతాడు. "గురుకృప" అంటే అదే. ఈశ్వరుడు, గురువు, ఆత్మ వీటిలో బేధం లేదు.

భ - దివ్యజ్ఞాన సమాజంలో, తమకు మార్గదర్శకులైన గురువుల కోసం ధ్యానం చేస్తారు.

మ - గురువు లోపలే వున్నాడు. 'ఆయన బయట వున్నాడు' అనే భ్రాంతిని తొలగించేందుకే, ధ్యానం నిర్దేశింపబడింది. నీవు ఎదురు చూస్తున్న ఆ గురువు క్రొత్తగా వచ్చేవాడు అయితే, అటువంటివాడు కనుమరుగై పోక తప్పదు. నిలుకడ లేని అటువంటి గురువు వలన ప్రయోజనం ఏముంది? అయితే 'నేను వేరు' అని లేదా 'నేను దేహం' అని భావించినంత కాలమూ, బాహ్య గురువు కూడా అవసరమే. దేహంతో తప్పుడు తాదాత్మ్యం పోతే, గురువు ఆత్మకంటే భిన్నం కాదని తెలుస్తుంది.

భ - 'దీక్ష' మొదలైనవాటి ద్వారా గురువు ఆత్మజ్ఞానప్రాప్తికి సాయపడతాడా?

మ- నిన్ను చేత్తో పట్టుకొని, నీ చెవిలో వుపదేశం చేస్తాడా గురువు? నీవు నిన్ను గురించి ఎలా ఊహించుకుంటున్నావో, అదే విధంగా గురువును గురించి కూడా ఊహించుకోవచ్చు. 'నాకు దేహం వున్నద'ని నీవు భావిస్తున్నావు కాబట్టి, 'గురువుకు కూడా దేహం వుంటుందని, ఆయన నీకు ఏదో ప్రత్యక్షంగా చేసి పెడతాడ'ని భావిస్తున్నావు. కానీ, గురువు చేసే పని 'లోపల' అనగా ఆధ్యాత్మిక పరిధిలో వుంటుంది.

భ - గురువును కనుగొనడం ఎలా?

మ - సర్వవ్యాపకమైన భగవంతుడు అవ్యాజమైన కృపచేత, తన ప్రియభక్తునిపై జాలి వహించి, అతని పరిణతికి అనుగుణమైన రీతిలో ప్రత్యక్షమవుతాడు. భక్తుడు ఆ గురువును 'మానవమాత్రుడు' అని భావించి, రెండు భౌతిక దేహాల నడుమ వుండే విధంగా, ఆయనతో సంబంధాన్ని పెట్టుకోచూస్తాడు. మానవ దేహాన్ని దాల్చి వచ్చిన భగవంతుడు లేక ఆత్మ అయిన ఆ గురువు, భక్తుని హృదయంలో మార్పు తెస్తాడు. 'తాను పోయే దారి తప్పు' అని అతడు గ్రహించేలా చేస్తాడు. అతడు తనలోని ఆత్మను సాక్షాత్కరించుకొనేంత వరకు, సరైన దారిలో అతనికి మార్గదర్శనం చేస్తాడు.

భ - భక్తుడు అపుడు ఏమి చేయాలి?

మ - అతడు గురూపదిష్టమైన రీతిగా నడచుకోవాలి, తనలో తాను మునిగి సాధన చేయాలి. గురువు 'అంతరం'లోను వున్నాడు, 'బాహ్యం'లోను వున్నాడు. కనుక నిన్ను లోపలికి నెట్టేందుకు అనుగుణమైన పరిస్థితులు కల్పించి, అదే సమయంలో కేంద్రం వద్దకు నిన్ను లాగుకొనేందుకు వీలుగా, అంతరాన్ని సిద్ధం చేస్తాడు. అలా బయటి నుండి ఒక త్రోపు త్రోసి, లోపలి నుండి ఒక గుంజు గుంజుతాడు. అలా నీవు కేంద్రంలో స్థిరంగా నిలిచి వుండేటట్లు చేస్తాడు.

'నీ ప్రయత్నాల ద్వారా లోకాన్ని జయించవచ్చున'ని నీవు భావిస్తున్నావు. కానీ, బయట నీకు ఆశాభంగం కలిగి, నీ చూపు లోపలికి తిరిగినపుడు, నీవు అనుకుంటావు: “ఓహో! మానవ శక్తిని మించిన మహాశక్తి ఒకటి వుంది!"

'అహంత' మదించిన ఏనుగువంటిది. ఏనుగును వశంలోకి తేవాలంటే, అది ఒక సింహానికే సాధ్యం. అంతకంటే తక్కువ శక్తి గలది ఏదీ, దానిని నిగ్రహించలేదు. అటువంటి సింహంవంటివాడు గురువు. గురువుయొక్క చూపు పడిన మాత్రాన, ఏనుగువంటి అహంత గజగజ వణకి, మరణిస్తుంది.

'నీవు అనేవాడవు లేకుండా పోవటంలోనే నీయొక్క ఘనత వుంటుంద'ని క్రమంగా నీవు గ్రహిస్తావు. ఆ స్థితి లభించాలంటే, నిన్ను నీవు సమర్పించుకోవాలి. అపుడే తన వుపదేశాన్ని స్వీకరించేందుకు, యోగ్యమైన స్థితిలో నీవు వున్నట్లు గురువు కనుగొని, నీకు తగిన మార్గదర్శనం చేస్తాడు.

భ - ఏ రకమైన దీక్ష ఇవ్వకుండా, ప్రత్యక్షంగా కనిపించేది ఏదీ చేయకుండా, 'గురువు మౌనం' ఆయన వాక్కుకంటే ఎక్కువ శక్తివంతమై ఎలా వుంటుంది? శాస్త్రాధ్యయనంకంటే, అటువంటి మౌనం వుత్తమమైనది ఎలా అవుతుంది?

మ- 'మౌనం' అత్యంత శక్తితో కూడిన కార్యం. శాస్త్రాలు ఎంత విస్తృతంగా వర్ణించి చెప్పినా, ఎంతగా నొక్కి వక్కాణించినా, అవి ప్రభావితం చేయలేవు. గురువు నిశ్చలంగా వున్నా, 'ఆయన అనుగ్రహం' అందరిలోను వ్యాప్తమై, విజయ ప్రదమై వుంటుంది. గురుని ఈ 'మౌనం' సకల శాస్త్రముల సమాహారముకంటే విశాలం, స్ఫుటం, ప్రభావవంతం అయి వుంటుంది.

భ - కానీ, భక్తుడు ఆనందాన్ని పొందగలడా?

మ - భక్తుడు గురువుకు తనను తాను సమర్పించుకుంటాడు. అంటే, అతడు 'నేను' అనే భావనను మచ్చుకైనా మిగుల్చుకోలేదని అర్థం. సంపూర్ణ శరణాగతిలో జీవభావం అంతా నశిస్తుంది. ఇక అపుడు దైన్యానికి, దుఃఖానికి తావే లేదు. శాశ్వతమైన పరతత్త్వం ఆనందమే. వేరు కాదు. అది తానై సాక్షాత్కరిస్తుంది.

భ - అనుగ్రహాన్ని నేను ఎలా పొందగలను?

మ - 'ఆత్మ' అనుగ్రహ రూపం. అది పొందేది కాదు. చేయవలసిందల్లా, అది వున్నట్లు తెలుసుకోవడమే.

సూర్యుడు అంటే ప్రకాశమే. అది చీకటిని చూడదు. అయినా సూర్యుడు రాగానే, చీకటి పారిపోయిందని చెబుతారు. అదే విధంగా, గురువుయొక్క దృష్టి పడగానే, భక్తునిలోని అజ్ఞానం, భ్రాంతి స్వరూపమైన అంధకారంలాగ మటుమాయమైపోతుంది. నీవు సూర్యకాంతిచేత పరివేష్టితుడవై వున్నావు. అయినా సూర్యుడిని చూడగోరితే, సూర్యునివైపు నీవు తిరగాలి, సూర్యుడిని చూడాలి. అలాగే 'అనుగ్రహం' అనేది ఇపుడే ఇక్కడే వున్నప్పటికీ, సరైన రీతిగా దానికి నీవు చేరిక అయినపుడే అది లభిస్తుంది.

భ - 'దైవానుగ్రహం' సాధకునిలో శీఘ్రపరిపక్వతను కల్పించలేదా?

మ - అదంతా గురువుకు వదలివేయి. ఆయనకు నిన్ను నీవు నిర్నిబంధంగా సమర్పించుకో. నీవు రెండింటిలో ఏదో ఒకటి చేయాలి. నీవు అశక్తుడవనీ, నిన్ను ఆదుకొనేందుకు వున్నతమైన శక్తి ఒకటి కావలసి వుందనీ, అనుభవ పూర్వకంగా తెలుసుకొని, నిన్ను నీవు పూర్తిగా అర్పించుకోవాలి. లేదా నీ దురవస్థకు కారణం ఏమిటో విచారించి, మూలంలోకి వెళ్ళి, అలా ఆత్మలోపల లీనమై పోవాలి. ఏ విధంగా చేసినా, నీవు దుఃఖవిముక్తుడవు అవుతావు. భగవంతుడు లేదా గురువు శరణాగతి చెందిన భక్తుడిని ఎన్నటికీ పరిత్యజించడు.

భ - 'గురువు లేదా భగవంతుని ముందు సాష్టాంగపడటం'లో గల ఆంతర్యం ఏమిటి?

మ- సాష్టాంగ ప్రణామము 'అహంత అణగింది' అనడానికి గుర్తు. 'అహంత స్వమూలంలో విలీనమైంద'ని దానికి అర్థం. బాహ్యంగా మోకరిల్లడం వలన, తల వంచడం వలన, సాష్టాంగ పడడం వలన భగవంతుడు లేదా గురువు మోసపోడు. "అహంత వున్నదా, లేదా?" అని చూస్తాడు.

భ - తమ అనుగ్రహానికి గుర్తుగా తమ విస్తరిలో నుండి తీసి, కొంచెం ప్రసాదం పెడతారా?

మ - అహంతను తలపులోకి రానీయకుండా భుజించు. అపుడు నీవు తినేదే 'భగవంతుని ప్రసాదం' అవుతుంది.

భ - చదువుకున్న వ్యక్తికి జ్ఞానయోగ్యత ఎక్కువ వుంటుంది కనుక, అతనికి గురుకృప అవసరం లేదు కదా?

మ- అక్షరజ్ఞానం లేని ఒక జ్ఞాని ముందు, పండితుడు అయినవాడు కూడా మోకరిల్లవలసిందే. 'నిరక్షరాస్యత' అజ్ఞానమైతే, 'అక్షరాస్యత' చదువుకున్న అజ్ఞానం. పరమార్థ విషయంలో ఇద్దరూ అజ్ఞానులే. జ్ఞాని అయినవాడు మరో దృష్టితో చూస్తే అజ్ఞానియే. ఎందుకంటే అతనికి అన్యం ఏదీ లేదు.

భ - 'కానుకలు తెచ్చి సమర్పించడం' అనేది గురువుయొక్క అనుగ్రహాన్ని ఆశించే కదా? అందుకే కదా ఆగంతకులు భగవాన్కు కానుకలు అర్పిస్తున్నారు?

మ- వారు కానుకలు తెచ్చేది ఎందుకు? అవి నాకు కావాలా? నేను వద్దన్నా, నాకు బలవంతంగా కానుకలు ఇస్తున్నారు! ఎందుకు? చేపలను పట్టేందుకు ఎర వేయడంవంటిది కాదా ఇది? చేపలు పట్టేవాడు, చేపలకు ఆహారం ఇవ్వాలని ఆత్రంగా వుంటాడా? లేదు. చేపలను తనకు ఆహారంగా చేసుకోవాలని ఆత్రంగా వుంటాడు!

భ - మోక్షసిద్ధికి పూర్వం, సోపాన క్రమంగా దీక్షలు ఇవ్వడం అనే 'దివ్యజ్ఞానం' వారి ఆలోచన సరైనదేనా?

మ- ఒక జన్మలో మోక్షం సిద్ధించినవారు, గత జన్మలలో దీక్షలన్నింటినీ పూర్తి చేసుకుని వుండాలి.

భ - "జ్ఞానులు మరణానంతరం నాలుగైదు విధములైన కర్మలను మాత్రమే ఎన్నుకోవాలని, అది తప్పక ఈ లోకంలోనే కానక్కర్లేద"నీ దివ్యజ్ఞానంవారు అంటారు. భగవాన్ అభిప్రాయం ఏమిటి?

మ- కర్మలు స్వీకరించేది కొందరు మాత్రమే కావచ్చు, అందరూ కాదు.

భ - అదృశ్య ఋషి సోదర వర్గాన్ని మీరు ఎరుగుదురా?

మ- అదృశ్యంగా వున్నవారిని నీవు ఎలా చూడగలవు?

భ - చైతన్యంలో.

మ- చైతన్యంలో బాహ్యమైనది ఏదీ వుండదు.

భ - వారిని నేను సాక్షాత్కరింపచేసుకోగలనా?

మ- సాక్షాత్తుగా వున్న నీ నిజతత్త్వాన్ని నీవు సాక్షాత్కరించుకుంటే, అపుడు ఆ ఋషులయొక్క, గురువులయొక్క సాక్షాత్కారం ఏమిటో నీకు స్పష్టమవుతుంది. వున్నది ఒకే గురువు. ఆ గురువు ఆత్మ.

భ - పునర్జన్మ నిజమేనా?

మ- అజ్ఞానం వున్నంతవరకు పునర్జన్మ వుంటుంది. నిజానికి పునర్జన్మ అంటూ ఇపుడుగానీ, ఇంతకుముందుగానీ ఏదీ లేనేలేదు. ఇటుపైన కూడా ఏదీ వుండదు. సత్యము ఇదే.

భ - ఒక యోగి, తన గత జన్మలను గురించి తెలుసుకోగలడా?

మ- నీవు గతజన్మలను గురించి తెలుసుకోవాలనుకుంటున్నావే! నీకు ఈ జన్మ గురించి తెలుసా అసలు? 'వర్తమానం' ఏమిటో కనుక్కో మిగతావి వెన్నంటి వస్తాయి. అయినా, ఇపుడు మనకు వున్న పరిమిత జ్ఞానంతోటే, నీవు అంతగా దుఃఖపడుతున్నావు కదా! ఇంకా ఎక్కువ జ్ఞానభారాన్ని ఎందుకు నీవు మోయటం? ఇంకా ఎక్కువ దుఃఖపడేందుకా?

భ - ఇతరులకు ఆత్మసాక్షాత్కారాన్ని కలుగజేసేందుకు, భగవాన్ సిద్ధులు వుపయోగిస్తారా? లేదా అందుకోసం భగవాన్ పొందిన ఆత్మసాక్షాత్కారం సరిపోతుందా?

మ- సమస్త సిద్ధులకు వున్న శక్తికంటే కూడా, ఆత్మసాక్షాత్కారం వలన చేకూరిన ఆధ్యాత్మిక శక్తి ఎన్నో రెట్లు ఎక్కువ సమర్థవంతమై వుంటుంది. జ్ఞానిలో అహంకారం వుండదు. అందువల్ల జ్ఞాని దృష్టిలో 'ఇతరులు అనబడేవారు లేరు. అన్నింటికంటే గొప్ప మేలు, నీకు ఎవరైనా చేయగలిగింది ఏమిటి? అది ఆనంద 'ప్రదానం. 'ఆనందం' శాంతిజనితం. 'శాంతి' రాజ్యమేలాలంటే, ఆందోళన లేకుండా వుండాలి.

ఆందోళనకు కారణం, మనస్సులో తలెత్తే తలపులు. ఆ మనస్సు లేకపోతే, ఇక అంతా శాంతిమయమే. నీవు నీ మనస్సును నిర్మూలిస్తే తప్ప, నీకు శాంతి లభించదు, ఆనందం లభించదు. నీకు నీవే ఆనందంగా వుండకపోతే, 'ఇతరుల'కు నీవు ఆనందాన్ని ఎలా పంచి ఇవ్వగలవు? జ్ఞానికి మనస్సు వుండదు కనుక, అతనికి 'ఇతరులు' అని ఎవరూ వుండరు. ఆ 'ఇతరుల'కు ఆనందం లభించాలంటే, జ్ఞానికి కలిగిన ఆత్మసాక్షాత్కారం ఒక్కటే చాలును.

## 8. శాంతి, ఆనందము

భక్తుడు - నాకు 'శాంతి' ఎలా లభిస్తుంది? విచారణద్వారా దానిని పొందలేనేమో అనిపిస్తోంది?

మహర్షి - 'శాంతి'యే నీ సహజస్థితి. ఆ సహజస్థితికి ప్రతిబంధంగా వుండేది మనస్సు. నీ విచారణ నీ మనస్సులోనే సాగుతోంది. ఆ 'మనస్సు' అంటే ఏమిటో విచారణ చేయి. అపుడు అది మాయమవుతుంది. తలపుకు భిన్నంగా మనస్సు అంటూ ఏదీ లేదు. అయినప్పటికీ, తలపు పైకి లేస్తుండడాన్నిబట్టి, అది ఎక్కడ నుండి లేస్తున్నదో ఊహించి, దానిని 'మనస్సు' అని పేర్కొంటున్నావు. ఆ మనస్సు ఏమిటి అని తరచి చూస్తే, 'మనస్సు అని చెప్పబడేది ఏదీ లేద'ని నీవు కనుగొంటావు. ఆ విధంగా మనస్సు అంతరించి పోయినపుడు, శాశ్వతమైన శాంతి నీకు అనుభూతం అవుతుంది.

భ - కవిత్వం, సంగీతం, జపం, భజన, సుందరమైన ప్రకృతి దృశ్యములు, ఆధ్యాత్మిక కావ్య పఠనం మొదలైనవాటిద్వారా; "అంతా ఒక్కటే" అనే నిజమైన ఏకాత్మ భావం, ఒక్కొక్కసారి అనుభవంలోకి వస్తుంది. అటువంటి ప్రగాఢ శాంతి, ఆనంద భావనయే (ఎక్కడ జీవాత్మకు చోటు లేదో భగవాన్ పేర్కొనే 'హృదయంలోకి ప్రవేశించడమా?' దానినే అభ్యసిస్తే, అది గాఢ సమాధికి, తద్వారా పూర్ణసత్ సందర్శనానికి దారి తీస్తుందా?

మ - ప్రీతిదాయకములైన విషయాలు మనస్సుకు గోచరించినపుడు, ఆనందం కలుగుతుంది. ఆ ఆనందం ఆత్మగతమైనదే. మరొక ఆనందం లేదు. అది అన్యమూ కాదు, ఎక్కడో వున్నదీ కాదు. నీకు సంతోషాన్ని ఇస్తున్నాయని భావించే అటువంటి సందర్భాలలో, నీవు ఆత్మలో మునుగుతున్నావు. ఆ 'మునగడం' అనేది స్వతఃసిద్ధమై వున్న ఆనందంగా పరిణమిస్తుంది. ఆ ఆనందాన్ని ఇతర విషయాల మీద, సంభవాల మీద ఆరోపించడానికి కారణం తలపులతోటి సంసర్గమే.

నిజానికి ఆనందం నీలోపలే వుంది. ఈ సందర్భాలలో నీవు నీకు తెలియకుండానే, ఆత్మలో మునుగుతున్నావు. 'ఆనందమే' ఆత్మ, కేవలమైన సద్రూపము. ఆ 'ఆనందం' నీకన్నా వేరు కాదు. నీవే అది. ఈ అనుభవంద్వారా ఏర్పడిన నమ్మకంతో నీవు తెలిసి ఆత్మలో మునిగితే, అదే "సాక్షాత్కారము." నీవు ఆత్మలో అంటే హృదయంలో ఎరుకతో మునగవలెననే నేను కోరేది. నేను చెప్పేది ఇది.

# రెండవ భాగము

## 1. ఆత్మవిచారణ

భక్తుడు - ఆత్మను సాక్షాత్కరింప చేసుకోవడం ఎలా?

మహర్షి - ఎవరి ఆత్మను? కనుక్కో

భ - నా ఆత్మనే. కానీ నేను ఎవడను?

మ- నీవే స్వయంగా కనుక్కో

భ - ఎలాగో నాకు తెలియదు?

మ - ఆ ప్రశ్నను గురించి సరిగ్గా ఆలోచించు. 'నాకు తెలియదు' అని చెప్పేది ఎవరు? నీవు చెప్పిన మాటలోని "నేను" ఎవరు? తెలియనిది ఏమిటి?

భ - నా లోపల ఎవరో ఒక వ్యక్తి లేదా ఏదో ఒక తత్త్వం.

మ- ఆ ఎవరో ఒక వ్యక్తి ఎవరు? ఎవరి లోపల?

భ - బహుశ ఏదో ఒక శక్తి.

మ - కనుక్కో

భ - నేను ఎందుకు జన్మించాను?

మ - జన్మించింది ఎవరు? నీ ప్రశ్నలు అన్నింటికీ అదే జవాబు.

భ - అయితే, నేను ఎవడను?

మ - (చిరునవ్వుతో) నీవు నన్ను పరీక్షించడానికి వచ్చావా? నీవు ఎవరవో నీవే చెప్పాలి.

భ - నేను ఎంతగా ప్రయత్నించినా, ఆ 'నేను'ను నేను పట్టుకోలేకపోతున్నాను అనిపిస్తోంది. అది నాకు కనీసం స్పష్టంగా మనోగోచరం కూడా కావటం లేదు.

మ- "నేను" అనేది మనోగోచరం కావటం లేదని చెబుతున్నది ఎవరు? ఒక 'నేను' రెండవ 'నేను'ను గ్రహించేందుకు, నీలో రెండు 'నేను'లు వున్నాయా?

భ - 'నే నెవడను?' అని విచారణ చేయడానికి బదులు, 'నీవు ఎవడవు?' అని నన్ను నేను ప్రశ్నించుకోవచ్చునా? అలా చేస్తే నా మనస్సు 'నీవు' మీద నిలవవచ్చు. ఆ 'నీవు'ను గురురూపంలో వున్న భగవంతునిగా భావిస్తున్నాను కాబట్టి. 'నే నెవడను?' అని నన్ను నేను ప్రశ్నించుకునే బదులు, ఇలా విచారణ చేస్తే, నేను వెదకే ఆ లక్ష్యానికి మరింత దగ్గర అవుతానేమో, బహుశ?

మ - నీ విచారణ ఏ రూపంలో వున్నా, చిట్టచివరకు, నీవు ఏకమైన ఆ 'నేను' వద్దకు, ఆత్మ వద్దకు రావలసిందే.

'నేను', 'నీవు', గురువు, శిష్యుడు మొదలైన కల్పించిన తేడాలన్నీ నీ అజ్ఞానానికి గుర్తు మాత్రమే. 'అహం-బ్రహ్మము' ఒక్కటే వుంది. మరో విధంగా భావిస్తే, అది నిన్ను నీవు వంచించుకోవడమే అవుతుంది.

'ఋభు-నిదాఘు సంవాదము' అనే పేరుతో గురుశిష్యుల కథ ఒకటి పురాణాల్లో వుంది. అది ఈ సందర్భంలో జ్ఞానదాయకంగా వుంటుంది.

'ఋభుమహర్షి' తన శిష్యుడైన 'నిదాఘున'కు కేవల అద్వితీయ పరబ్రహ్మము అయిన పరతత్త్వమును గురించి బోధ చేసాడు. నిదాఘుడు పండితుడు, వివేకజ్ఞుడు అయినప్పటికీ, జ్ఞానమార్గాన్ని స్వీకరించి, ఆచరించేంత దృఢ నిశ్చయం ఏర్పడకుండా వెళ్ళి, స్వస్థలమైన ఒక పట్టణంలో స్థిరపడి, కర్మాచరణకు అంకితమైన జీవితంలో మునిగిపోయాడు.

ఋభువుకు తన శిష్యుని పట్ల అపారమైన వాత్సల్యం వుండేది. నిదాఘునకు కూడా తన గురువు పట్ల ప్రగాఢమైన భక్తి వుండేది. వయస్సు పైబడినప్పటికీ, ఋభువు పట్టణంలో వున్న తన శిష్యుని వద్దకు వెళ్ళి, అతడు ఆచార కాండ నుండి ఏ మాత్రమైనా బయటపడ్డాడా? అని చూసి వస్తుండేవాడు. ఒక్కొక్కపుడు మారువేషంలో కూడా వెళుతుండేవాడు. తనను గమనిస్తున్నాడని తెలియనపుడు కూడ, నిదాఘుడు ఎలా వ్యవహరిస్తున్నాడో గురువు కనిపెట్టి చూసేవాడు.

అటువంటి సందర్భం ఒకసారి వచ్చింది. ఋభువు అనాగరికుడైన గ్రామీణుని లాగ మారువేషం వేసుకుని వెళ్ళాడు. అక్కడ నిదాఘుడు రాజుగారి ఊరేగింపు వస్తుంటే, కళ్ళప్పగించి చూస్తూ నిలుచున్నాడు. పట్టణంలో వుంటున్న నిదాఘుడు గురువును గుర్తించలేదు. ఆయన ఒక గ్రామీణుడని భావించాడు. ఆ గ్రామీణుడు నిదాఘుణ్ణి సమీపించి, 'హడావుడిగా వుంది, ఏమిటి సంగతి?' అని అడిగాడు. "రాజుగారి ఊరేగింపు వెళుతోంది" అని నిదాఘుడు సమాధానం ఇచ్చాడు.

"ఓ హో! రాజుగారా? ఊరేగింపుగా వెళుతున్నారా? ఏదీ, రాజుగారు వున్నది. ఎక్కడ?" అని అడిగాడు గ్రామీణుడు.

"అదిగో ఆ ఏనుగుపైన" అని చెప్పాడు నిదాఘుడు.

"రాజు ఏనుగుపైన వున్నాడని చెప్పావు. అవును, నేను ఇద్దరినీ చూసాను. అయితే రాజు ఎవరు? ఏనుగు ఏది?" అని గ్రామీణుడు అడిగాడు.

"ఏమిటి? నీవు ఇద్దరినీ చూస్తున్నావు. కానీ పైన వున్న మనిషి రాజు అనీ, క్రింద వున్న జంతువు ఏనుగు అనీ నీకు తెలియదన్న మాట! నీలాంటి మనిషితో మాట్లాడడం వల్ల ఏమి ప్రయోజనం?" అన్నాడు నిదాఘుడు.

"చిత్తం. ఏదో తెలియనివాడిని, కోపగించుకోవద్దు" అని గ్రామీణుడు బ్రతిమాలుతూ, మరల ఇలా అడిగాడు. "నీవు 'పైన' అనీ, 'క్రింద' అనీ అన్నావే, వాటికి అర్థం ఏమిటి?"

నిదాఘుని సహనం చచ్చిపోయింది. "నీవు రాజును చూస్తునావు, ఏనుగును చూస్తున్నావు. పైన రాజు, క్రింద ఏనుగు. కానీ 'పైన' అంటే ఏమిటో, 'క్రింద' అంటే ఏమిటో తెలుసుకోవాలంటావు?" అని మండిపడ్డాడు. "చూసిన దృశ్యం, చెప్పిన మాట, వీటివల్ల నీకు ఏమీ తెలియకపోతే, ఇక ప్రత్యక్షంగా చేసి చూపిస్తేనే గానీ తెలియదు. ఇలా రా. ముందుకు వంగు. నీకు అంతా చక్కగా తెలుస్తుంది" అన్నాడు నిదాఘుడు.

ఆ గ్రామీణుడు చెప్పినట్లు చేసాడు. నిదాఘుడు అతని భుజాలపైన ఎక్కి ఇలా చెప్పాడు. "ఇదిగో ఇపుడు తెలుసుకో, నేను 'పైన' రాజులాగా వున్నాను. నీవు 'క్రింద' ఏనుగులాగ వున్నావు. ఇపుడు అర్థమైంది అనుకుంటాను."

"లేదు, ఇంకా కాలేదు" అన్నాడు ప్రశాంతంగా ఆ గ్రామీణుడు. "పైన రాజులాగ నీవు వున్నావు. క్రింద ఏనుగులాగ నేను వున్నాను అన్నావు. సరే. 'రాజు', 'ఏనుగు', 'పైన', 'క్రింద' ఇంతవరకు స్పష్టంగానే వుంది. కానీ, ఏమనుకోకుండా, ఇది చెప్పు! 'నేను', 'నీవు' అంటున్నావే, వాటి గురించి నీ వుద్దేశ్యం ఏమిటి?" వున్నట్లుండి ఈ విధంగా "నేను'ను గురించి, ఆ 'నేను'కు వేరుగా 'నీవు'ను గురించి విడమరచి చెప్పు" అనే బ్రహ్మాండమంత ప్రశ్నతో, ఆ గ్రామీణుడు తనను ఎదుర్కొనేసరికి, నిదాఘుని మనస్సులో మెరుపు మెరసినట్లు అయింది. "భౌతిక జీవితములోని పైపై విషయముల నుండి మరల్చి, పారమార్థికమైన ఆత్మస్వరూపం వైపుకు నా మనస్సును ఇలా త్రిప్పగలిగింది పూజ్యపాదులైన ఋభుమహర్షులే, నా గురుదేవులే, మరొకరికి ఇది సాధ్యమా?" అనుకొని, “హే దయామయా! గురువరా! నీ కృపా భిక్షను అర్థిస్తున్నాను" అంటూ అతడు క్రిందకు దూకి, గురువు పాదములపై పడి వేడుకున్నాడు.

కాబట్టి ఆత్మవిచారము ద్వారా, భౌతిక జీవితములోని పైపై విషయములను ఇపుడే, ఇక్కడే అధిగమించడం నీ లక్ష్యం అయితే; దేహమునకు సంబంధించిన 'నీవు', 'నేను' అనే భేదదృష్టికి అవకాశం ఎక్కడ? తలపుల మూలాన్ని వెదకేందుకు నీ మనస్సును లోపలికి త్రిప్పగా, 'నీవు' ఎక్కడ వుంది, 'నేను' ఎక్కడ వుంది? అంతా తానే అయిన ఆత్మను వెదకు, ఆత్మగా వుండు.

భ - కానీ, 'నేను'ను 'నేను' వెదకడం విచిత్రంగా లేదా? ఆఖరికి ఈ 'నే నెవడను?' అనే విచారణ, ఒక శుష్క మంత్రంగా పరిణమిస్తుందేమో? లేదా మంత్రాన్ని జపించినట్లు, నేను నాకే ఈ ప్రశ్నను నిరంతరం వేసుకుంటూ వుండాలా?

మ - 'ఆత్మవిచారణ' నిరర్థకమైన విధానం కానే కాదు. అది మంత్రజపంకంటే మిన్న అయింది. 'నే నెవడను?' అని ప్రశ్నించుకోవడం మనోవ్యాపార మాత్రం అయినట్లైతే, దానివల్ల అంతగా ప్రయోజనం సిద్ధించదు. ఆత్మవిచారణ యొక్క అసలు వుద్దేశ్యం - మనస్సును అంతటినీ కూడగట్టి, దాని మూలంలో నిలిపి వుంచడం. అందుచేత అది ఒక 'నేను' మరొక 'నేను'ను వెదకడం కాదు.

ఆత్మవిచారణ పనికిమాలిన పద్ధతి ఏ మాత్రం కాదు. అది శుద్ధాత్మజ్ఞాన నిష్ఠలో మనస్సును అంతటినీ స్థిరంగా నిలిపి వుంచే అత్యంత క్రియాశీలక శక్తి.

నీవు నిరుపాధిక సత్తామాత్ర స్వరూపుడవు. ఆ నీ నిజతత్త్వాన్ని సాక్షాత్కరింప చేసుకొనేందుకు 'ఆత్మవిచారము' ఒకే ఒక అమోఘమైన, సూటి అయిన మార్గము.

భ - 'జ్ఞానసిద్ధికి సూటిదారి ఆత్మవిచారం ఒక్కటే' అని భావించడం ఎందుకు?

మ- ఆత్మవిచారణ మినహా మిగిలిన అన్ని రకముల సాధనలలోను, ఆయా సాధనలు చేయడానికి ఉపకరణంగా, 'మనస్సును నిలిపి వుంచుకోవడం' పూర్వ భావంగా వుంటుంది. మనస్సు లేకుంటే, ఏ సాధనను చేయడానికి వీలు కాదు. అలా చేసే సాధనలోని వివిధ దశలలో, 'అహంత' అనేక సూక్ష్మరూపాలు ధరించే అవకాశం వుంటుంది. అహంత మాత్రం నశించక మిగిలి వుంటుంది.

అందుకే జనకుడు ఇలా ప్రకటించాడు: "నన్ను ఇన్నాళ్ళు నానా అవస్థలకు గురి చేసిన ఆ దొంగను, ఇపుడు కనుగొన్నాను. ఇక తక్షణమే వాని సంగతి తేలుస్తాను.” వాస్తవానికి జనకుడు పేర్కొన్న దొంగ 'అహంతయే, మనస్సే.'

భ - కానీ, ఆ దొంగను ఇతర సాధనలద్వారా కూడా పట్టుకోవచ్చును కదా?

మ - ఆత్మవిచారము ద్వారా కాకుండా, తక్కిన సాధనలద్వారా 'అహంతా నాశము' లేక ‘మనోనాశము' కొరకు చేసే ప్రయత్నం, "దొంగయే పోలీసు వేషం వేసుకొని, దొంగను అనగా తనను తాను పట్టుకొనే ప్రయత్నం చేయడం వంటిది.” ఆత్మవిచారణ ద్వారా మాత్రమే, "అహంత' లేక 'మనస్సు' అనేది అసలు లేనే లేదు" అనే సత్యం తెలుస్తుంది. దానిద్వారానే శుద్ధ నిర్విశేష పరమాత్మ తత్త్వం లేక బ్రహ్మం సాక్షాత్కరిస్తుంది.

ఆత్మ బ్రహ్మానంద స్వరూపం. సర్వమూ అదే. ఆత్మ సాక్షాత్కారానంతరం ఇక తెలుసుకోవలసింది ఏమీ లేదు.

భ - పరిమితులకు లోబడిన ఈ జీవితంలో, నాకు ఆత్మానంద లబ్ది సాధ్యమా?

మ- ఆత్మానందం, ఎల్లపుడూ నిన్ను విడువక అంటిపెట్టుకొని వుంది. శ్రద్ధతో ప్రయత్నిస్తే, నీకు నీవే దానిని కనుగొంటావు.

దుఃఖానికి కారణం, నీ బాహ్యజీవితంలో లేదు. అది అహంతారూపంగా నీ లోపల వుంది. నీవు నీపై పరిమితులు విధించుకొని, తరువాత వాటిని అధిగమించడానికి నిరర్థకంగా పెనుగులాడుతున్నావు. అహంత వల్లనే ఈ దుఃఖం అంతా. అహంతతోనే అన్ని కష్టాలూ మొదలవుతాయి. దుఃఖానికి కారణం నీ లోపల వుండగా, ఆ కారణాన్ని జీవితంలోని సంఘటనలకు, సంభవాలకు అంటగట్టడం వల్ల నీకు ఏం ప్రయోజనం వుంటుంది?

అన్యమైన విషయాల నుండి నీకు ఏమి ఆనందం లభిస్తుంది? ఒకవేళ లభిస్తే, అది ఎంతకాలం వుంటుంది? అహంతను త్రోసివేసి, వుపేక్షించి, ఎండగడితే, నీవు ముక్తుడవు అవుతావు. అలాగాక, అది వున్నదని నీవు ఒప్పుకుంటే, అది నీపై పరిమితులు విధించి, ఆ పరిమితులను అధిగమించేందుకు చేసే వృథా అయిన పెనుగులాటలోకి నిన్ను పడద్రోస్తుంది. జనక చక్రవర్తికి ఇదే విధంగా ఆ దొంగ (అహంత) చెరుపు కలిగించేందుకు ప్రయత్నించాడు.

సర్వదా నీదే అయి వున్న ఆనందాన్ని పొందేందుకు, ఒకే ఒక దారి - నీవు నిజంగా ఏదైతే అయి వున్నావో, ఆ ఆత్మగా వుండడమే.

భ - 'ఆత్మ ఒక్కటే వున్నది' అనే సత్యాన్ని స్పష్టంగా గ్రహించనపుడు, విచారమార్గం కంటే ఎక్కువ వుపయుక్తంగా వుంటాయనే దృష్టితో భక్తి, యోగ మార్గాలను అనుసరించనక్కర్లేదా? బ్రహ్మజ్ఞానప్రాప్తి నాలాంటి సామాన్యునికి దుర్లభం కాదా?

మ- బ్రహ్మజ్ఞానాన్ని సంపాదించుకొని ఆనందాన్ని పొందడానికి, అది సంపాదించుకోవలసింది కాదు. నీ అజ్ఞాన దృష్టిని నీవు వదల్చుకోవాలి. నీవు తెలుసుకోవాలనుకున్న ఆ ఆత్మవు నీవే. నీకు వున్నది అని ఊహించుకునే అజ్ఞానం, నీకు అనవసరమైన దుఃఖానికి కారణం అవుతున్నది. ఇది దశముడి కథలో 'పదోవాడు ఏడీ?' అని లెక్కపెట్టి, 'లేడు, పోయాడు' అని దుఃఖించిన తక్కిన మూర్ఖుల తంతుగా వుంటుంది.

ఆ కథలో పదిమంది మూర్ఖులు ఒక నదిని దాటి, అవతలి ఒడ్డుకు చేరారు. అందరూ క్షేమంగా నదిని దాటి వచ్చారని నిశ్చయం చేసుకునే నిమిత్తం, వారిలో ఒకడు అందరినీ లెక్కించడం మొదలుపెట్టాడు. లెక్క పెట్టేటపుడు తక్కిన వారందరినీ లెక్కించి, తనను మాత్రం వదిలేసాడు. "నాకు తొమ్మిది మంది మాత్రమే లెక్కకు వస్తున్నారు. మనలో ఒకడు కనిపించుట లేదు. వాడు ఎవడై వుంటాడు?" అన్నాడు. “నీవు సరిగ్గా లెక్కపెట్టావా?” అని ఇంకొకడు అడిగి, తాను కూడా లెక్కపెట్టాడు. అయితే వాడు కూడా తొమ్మిది మందినే లెక్కపెట్టాడు.

ఇలా ఆ పదిమందిలో ఒకడి తరువాత ఇంకొకడు, ఇలా ప్రతివాడూ తనను మినహాయించుకొని, మిగిలిన తొమ్మిది మందిని లెక్కించాడు. “మనం తొమ్మిది మందిమే వున్నాం. కనిపించకుండా పోయిన ఆ పదవవాడు ఎవడు?” అని వారు తమలో తాము ప్రశ్నించుకున్నారు. కనిపించని ఆ పదోవాడిని కనుగొనేందుకు, వారు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి. వారిలో ఆవేశపరుడైన వాడొకడు "మునిగిపోయినవాడు ఎవడైతేనేమి, వాడిన మనం పోగొట్టుకున్నాం" అని చెప్పి ఏడవసాగాడు. మిగిలిన తొమ్మిదిమంది వాడితో పాటు ఏడవడం మొదలుపెట్టారు.

నది ఒడ్డున కూర్చుని ఇలా విలపిస్తున్న వారిని చూసి, ఆ దారిన పోయే ఒక వ్యక్తి, సానుభూతితో "వారి ఏడుపుకు కారణం ఏమిటి?" అని అడిగాడు. జరిగిన విషయం వారు అతనికి చెప్పారు. "తాము ఎన్నిసార్లు లెక్కపెట్టుకున్నా.

పదిమందిలో తాము తొమ్మిది మందిమే లెక్కకు వస్తున్నామ'ని చెప్పారు. వారి కథ విన్న ఆ వ్యక్తి చూస్తే, ఎదురుగా పదిమంది నిక్షేపంగా వున్నారు. ఆ వ్యక్తికి జరిగింది ఏమిటో అర్థమైంది. "తాము పదిమందిమే అని, తమలో అందరూ నదిని దాటి క్షేమంగా వచ్చారనీ, వారు తమకు తాము తెలుసుకునేందుకు, ఆ వ్యక్తి ఇలా చెప్పాడు: "మీకు మీరే లెక్కపెట్టుకోండి. ఒకరి తరువాత ఒకరు - ఒకటి, రెండు, మూడు ఇలా వరుసగా లెక్కపెట్టుకోండి. నేను ఒక్కొక్కరి మీద ఒక దెబ్బ వేస్తాను. అపుడు అందరూ లెక్కలోకి వచ్చినట్లు, అదీ ఒక్కసారే వచ్చినట్లు నిశ్చయమవుతుంది. అపుడు 'కనిపించని' ఆ పదోవాడు ఇట్టే కనిపిస్తాడు." ఇది విని తమలో కనిపించకుండా పోయిన పదోవాడు దొరకుతాడని, వారంతా సంబరపడిపోయి, ఆ వ్యక్తి సూచించిన పద్ధతికి అంగీకరించారు.

ఆ బాటసారి, ఆ పదిమందిలోను ప్రతివాడికి అతని వంతు వచ్చినపుడు, ఒక దెబ్బ వేసాడు. తనమీద దెబ్బ పడినవాడు, తనను తాను పెద్దగా లెక్కించుకున్నాడు. 'పది' అని చివరి దెబ్బ తిన్నవాడు, తన వంతు రాగానే చెప్పాడు. తికమకపడి, వారంతా ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. "మనం పదిమందిమి" అని వారు ఏకకంఠంతో చెప్పి, తమకు దుఃఖనివృత్తి కలిగించిన ఆ బాటసారికి ధన్యవాదాలు తెలిపారు.

ఇదీ కథ. పదోవాడిని ఎక్కడి నుండి తీసుకొచ్చారు? అతడు అసలు లేకుండా పోయాడా? "మొదటి నుండీ వాడు వుండనే వున్నాడు" అని తెలుసుకొని, వారు క్రొత్తగా గ్రహించింది ఏముంది? వారి దుఃఖానికి హేతువు, "ఆ పదిమందిలో ఒకడు నిజంగా కనిపించకుండా పోవడం కాదు. వారి అజ్ఞానమే వారి దుఃఖానికి కారణం." తమలో ఒకడు లేకుండా పోయాడన్న ఊహ, భ్రాంతి (ఆ పదోవాడు ఎవడో వారికి తెలియకపోయినా కూడా)కి కారణం, వారు తొమ్మిది మందిని మాత్రమే లెక్కించడం.

నీ సంగతి కూడా అలాంటిదే. నీ అశాంతికి, దుఃఖానికి కారణమే లేదు.

అనంత, అద్వయ, పరమాత్మ స్వరూపుడవు అయిన నీవు, నీ నిజస్వరూపానికి పరిమితులు కల్పించుకొని, "పరిచ్ఛిన్నమైన జీవుడవు' అని వాపోతున్నావు. అంతట లేని ఆ పరిమితులను అధిగమించేందుకు, 'ఇది అనీ, అది అనీ' ఏవో సాధనలు చేయాలని అనుకుంటున్నావు. 'పరిమితులు వుండటం సత్యం' అని భావించుకొని చేసే సాధన, ఆ పరిమితులను అధిగమించేందుకు ఏ విధంగా సాయపడుతుంది? అందుకే నేను చెబుతున్నాను. నీవు నిజానికి శుద్ధఅనంత సత్తా మాత్రుడవు, పరమాత్మ స్వరూపుడవు. నీవు ఎల్లపుడూ ఆత్మవే. నీవు ఆత్మకంటే వేరు కాదు.

అందుచేత నీకు ఆత్మను గురించి తెలియకపోవడం అనేది లేనే లేదు. నీ అజ్ఞానం ఔపచారిక మాత్రమైన అజ్ఞానం. దశముడు పోయాడని భ్రమించిన పదిమంది మూర్ఖుల అజ్ఞానంవంటిది. వారికి దుఃఖహేతువైంది ఈ అజ్ఞానమే.

'యథార్థ జ్ఞానం' నీకు క్రొత్తదానిని దేనిని సృష్టించి తీసుకొని రాదు. అది కేవలం నీకు వున్న 'అజ్ఞాన జనితమైన అజ్ఞానాన్ని' తొలగిస్తుంది. నీ స్వభావానికి 'ఆనందం' కొత్తగా చేర్చబడదు. ఆ 'ఆనందం' నిజమైన నీ సహజస్థితిగా, శాశ్వతం, అక్షరం అయిన తత్త్వంగా సాక్షాత్కారం అవుతుంది. కనుక నీ దుఃఖవిముక్తికి మార్గం ఒక్కటే. ఆత్మను తెలుసుకో, ఆత్మగా వుండు. ఇది అందరానిది, పొందలేనిది ఎలా అవుతుంది?

## 2. సాధన, అనుగ్రహము

భక్తుడు - భగవంతుడి గురించిన పరిశోధన, అనాది కాలము నుండీ సాగుతూనే వుంది. అంతిమ నిర్ణయంగా ఏదైనా తేల్చి చెప్పబడిందా?

మహర్షి - (కొంత సమయం మౌనం వహించారు).

భ - (కలవరపడి) 'భగవాన్ మౌనమే నా ప్రశ్నకు సమాధానం' అని నేను భావించవలెనా?

మ - అవును. 'మౌనం' ఈశ్వర స్వరూపం. అందుకే ఇలా చెప్పబడింది.

“మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం”

భ - భగవంతుడి గురించి ఇటువంటి ప్రశ్నలను బుద్ధుడు ఉపేక్షించినట్లు చెబుతారు.

మ - ఈ కారణం వలన ఆయనను 'శూన్యవాది' అన్నారు. వాస్తవానికి బుద్ధుడు పూనుకున్నది ఒక్కటే. "భగవంతుడి గురించిన సిద్ధాంత చర్చలు చేయడంకంటే, ప్రధానంగా బ్రహ్మానంద ప్రాప్తికై ప్రయత్నించండి" అని ఆయన సాధకులను నిర్దేశించాడు.

భ - 'భగవంతుడు వ్యక్తావ్యక్త స్వరూపాలలో వుంటాడ'ని చెప్పబడింది. 'వ్యక్త రూపంలో, ఈ జగత్తు అంతటినీ తన స్వరూపంలో అంతర్భాగంగా కలిగి వుంటాడు' అంటారు. జగత్తులో అంతర్భాగమై వున్న మనం, సాకారుడైన ఆ భగవంతుడిని సులభంగా తెలుసుకుని వుండాలి కదా!

మ- 'జగత్తు, ఈశ్వరుల స్వరూప స్వభావాల'ను గురించి నిర్ణయానికి వచ్చే ముందు, నిన్ను గురించి నీవు తెలుసుకో.

భ - 'నన్ను నేను తెలుసుకోవడమే', భగవంతుడిని తెలుసుకోవడం అవుతుందా?

మ- అవును. దైవం నీలోనే వున్నాడు.

భ - అయితే, 'నన్ను నేను తెలుసుకోవడానికి లేదా దైవాన్ని గురించి తెలుసు కోవడానికి' ఆటంకంగా వున్నది ఏది?

మ- చంచలంగా తిరిగే నీ మనస్సు, పెడదారిన నడిచే నీ పద్ధతులు.

భ - నేను ఒక దుర్బల ప్రాణిని. లోపల వున్న అతీతమైన ఈశ్వరుని శక్తి, ఆ ఆటంకములను తొలగించవచ్చును కదా?

మ - అవును, నీకు కనుక ఆ ఇచ్ఛ వుంటే, ఈశ్వరుడు ఆ పని చేస్తాడు.

భ - నాలో ఆ ఇచ్ఛను ఆయనే కలిగించవచ్చును కదా?
సాధన, అనుగ్రహము

మ - అయితే నిన్ను నీవు అర్పించుకో.

భ - నన్ను నేను అర్పించుకుంటే (నేను శరణాగతి చెందితే, ఇక దైవప్రార్థన యొక్క ఆవశ్యకత వుండదా?

మ - 'శరణాగతి'యే అద్భుతమైన ప్రార్థన.

భ - నన్ను నేను సమర్పించుకోవాలంటే, ముందుగా ఆ ఈశ్వరుని స్వభావం తెలుసుకోనక్కర్లేదా?

మ- ఈశ్వరుడు నీకు ఏదేది చేయాలని కోరుకుంటున్నావో, అదంతా ఆయన

నీకు చేస్తాడనే నమ్మకం నీకుంటే, నీవు ఆయనకు శరణాగతుడవు కావాలి.

లేకపోతే, ఈశ్వరుని త్రోవన ఈశ్వరుడిని వుండనీ, నీవు నిన్ను తెలుసుకో.

భ - ఈశ్వరునికి లేదా గురువుకు నన్ను గురించిన చింత వుంటుందా?

మ- వారు నిజానికి ఇద్దరు కాదు, ఒక్కరే. వారు అభిన్నులు. "వారిలో నీవు ఎవరికోసం వెతికినా, వారు కూడా నిన్ను వెతుకుతున్నార"ని గట్టిగా నమ్ము. నీ ఊహకు అందనంత ఎక్కువగా, వారికి నీ చింత వుంటుంది.

భ - ఏసుక్రీస్తు పోయిన నాణెం గురించి, నీతి కథ చెప్పాడు. అందులో ఒక మహిళ ఆ నాణెం దొరికేవరకు వెతికింది.

మ - అవును. ఆ కథ ఈ విషయాన్ని వివరించడానికి, అతికినట్లు సరిపోతుంది. ఈశ్వరుడుగానీ, గురువుగానీ ఎపుడూ ముముక్షువు అయినవాని అన్వేషణలో వుంటారు. ఆ కథలో 'పోయింది నకిలీ నాణెం' అయినట్టైతే, ఆ మహిళ అలా చాలాసేపటి వరకు వెతికి వుండేది కాదు. దాని భావం ఏమిటో తెలుసా? భక్తి మొదలైన మార్గాలద్వారా, సాధకుడు యోగ్యతను సంపాదించుకోవాలి.

భ - దైవానుగ్రహం లభిస్తుందన్న విశ్వాసం చిక్కకపోవచ్చును కదా?

మ- అపక్వచిత్తులకు దైవానుగ్రహ స్పర్శ తోచకపోతే, దాని అర్థం దైవానుగ్రహం లేదని కాదు. అలా అయితే, దైవానికి ఒక్కొక్కపుడు అనుగ్రహం లేదనే భావం వస్తుంది. అపుడు ఆ దైవం దైవం కాకపోతాడు.

భ - "నీ విశ్వాసానికి అనుగుణంగానే, నీకు సమకూర్చబడుతుంది" అని ఏసుక్రీస్తు చెప్పింది ఇదేనా?

మ - అవును, అదే.

భ - అసలు "ఆ ఆత్మ ఎవరిని ఎన్నుకొంటుందో, అటువంటివాడే ఆత్మను తెలుసుకుంటాడ'ని ఉపనిషత్తులలో వున్నట్లు విన్నాను. ఆత్మ అసలు ఎన్నుకోవడం దేనికి? ఎన్నుకున్నట్లైతే, ఫలానా వ్యక్తినే ఎందుకు?

మ - సూర్యుడు ఉదయించినపుడు, కొన్ని మొగ్గలే వికసిస్తాయి. అన్నీ కాదు. అందుకు సూర్యుడిని నిందించగలవా? అలాగే, మొగ్గ తనంతట తాను వికసించ లేదు. అది వికసించాలంటే, సూర్యకాంతి కావల్సిందే.

భ - ఆత్మయే తనమీద 'మాయ' అనే ముసుగు వేసుకున్నది కనుక, ఆత్మయొక్క సహాయం అవసరం అని చెప్పవచ్చునా?

మ- నీవు అలా అనవచ్చు.

భ - ఆత్మ తనమీద తానే (మాయ అనే) ముసుగు వేసుకుంటే, ఆత్మయే ఆ ముసుగును తొలగించుకోవాలి కదా?

మ- అది అలా చేస్తుంది. అయితే 'ముసుగు ఎవరికి? అది చూడు.

భ - నేను ఎందుకు చూడడం? ఆ ఆత్మనే ముసుగును తొలగించమనండి.

మ- ముసుగును గురించి మాట్లాడేది ఆత్మ అయితే, అపుడు ఆ ఆత్మయే దానిని తొలగించుకుంటుంది.

భ - భగవంతుడు వ్యక్తి విశేషుడా?

మ - అవును. ఆయన సర్వదా ఉత్తమ పురుష, అంటే "నేను." ఆ "నేను" నిత్యమూ నీ ఎదుటే వుంది.

ప్రాపంచిక విషయాలకు నీవు ప్రాధాన్యం ఇస్తున్నావు కాబట్టి, భగవంతుడు తెర వెనుకకు పైదొలగినట్లు తోస్తోంది. నీవు తక్కిన అంతటినీ వదలి, ఆయనను మాత్రమే అన్వేషిస్తే, ఆయన ఒక్కడే 'నేను'గా, 'తాను'గా మిగులుతాడు.

భ - అద్వైత మతానుసారం "మోక్షం" అంటే పరమాత్మ నిర్విశేషమైన సంయోగం. విశిష్టాద్వైత మతానుసారం సవిశేషమైన సంయోగం. ద్వైతులు అసలు సంయోగమే లేదు అంటారు. వీటిలో దేనిని సరైనదిగా భావించాలి?

మ- భవిష్యత్తులో ఎపుడో, ఏదో జరుగుతుందని ఎందుకు ఈ ఊహాగానాలు? "నేను" అనేది వున్నదని అందరూ అంగీకరిస్తారు. ఏ మత సంప్రదాయానికి చెందినవాడైనా, ముముక్షువు అయినవాడు ముందుగా "నేను" అనేది ఏమిటో తెలుసుకోవాలి. "మోక్షం" అంటే ఏమిటో?; 'నేను' అనేది పరమాత్మలో ఐక్యమై పోతుందా? లేదా పరమాత్మకు భిన్నంగా నిలిచి వుంటుందా?" అని విచారించి తెలుసుకొనేందుకు, అపుడు కావలసినంత సమయం వుంటుంది. పూర్వనిర్ణయం చేయకుండా (ముందుగా ఒక నిర్ణయానికి రాకుండా) మనస్సును తెరచి వుంచుకోవాలి.

భ - ముక్తస్థితిని గురించి ఏదో కొంత అవగాహన వుంటే, అది సాధకునికి కూడా సహాయకారిగా, మార్గదర్శకంగా వుంటుంది కదా!

మ- 'మోక్షావస్థ' ఎలా వుంటుందో, ఇపుడే నిశ్చయించే ప్రయత్నం వలన ఏ మాత్రమూ ప్రయోజనం వుండదు. దానికి నిజమైన విలువ లేదు.

భ - ఎందువల్ల?

మ - నీవు ఒక తప్పుడు సూత్రాన్ని అనుసరిస్తున్నావు కనుక. నీవు చేసే ఇటువంటి నిర్ణయం, బుద్ధిమీదనే ఆధారపడినదై వుండాలి. ఆ బుద్ధి, ఆత్మనుండి పొందిన తేజస్సు వలన ప్రదీప్తమవుతుంది. ఆత్మయొక్క కించిన్మాత్ర ప్రకాశమును పొందినది అయిన బుద్ధి, 'తనకు మూలమైన ఆత్మను గురించి తీర్పు చెప్పేందుకు సిద్ధపడడం' దుస్సాహసం కాదా?

బుద్ధి ఆత్మను ఎన్నడూ చేరుకోలేదు. 'అటువంటి బుద్ధికి' ఆత్మసాక్షాత్కార స్థితిని గురించి, ముక్తదశా స్వరూపాన్ని గురించి విచారణ చేయడానికిగానీ; ఏ రకమైన నిర్ణయం చేయడానికిగానీ ఏమి అధికారం వుంది, ఏమి యోగ్యత వుంది? ఇది, కొవ్వొత్తి నుండి వచ్చే వెలుగును ప్రమాణంగా గ్రహించి, ఆ ఆధారం మీద సూర్యకాంతిని, దాని ఉత్పత్తిస్థానం వద్ద కొలిచేందుకు ప్రయత్నించడం వంటిది. సూర్యుని దాదాపుకు చేరకముందే, కొవ్వొత్తిలోని మైనం కరిగిపోతుంది.

కేవల ఊహాగానాలతో కాలక్షేపం చేయటం మాని, ఇక్కడే, ఇపుడే నీ లోపల నిత్యసిద్ధంగా వున్న సత్స్వరూప అన్వేషణకు పూనుకో.

## 3. జ్ఞాని, జగత్తు

భక్తుడు - జ్ఞాని జగత్తును చూస్తాడా?

మహర్షి - ఈ ప్రశ్న వచ్చింది ఎవరినుండి? జ్ఞానినుండా లేదా అజ్ఞాని నుండా?

భ - అజ్ఞాని నుండే అని అంగీకరిస్తున్నాను.

మ- 'జగత్తు' తన యాథార్థ్యాన్ని తేల్చుకోదల్చుకుంటున్నదా? ఆ సందేహం కలిగింది నీలో. ముందు, 'ఆ సందేహించేవాడు ఎవడో' అది తెలుసుకో. అపుడు 'ఈ జగత్తు సత్యమా, కాదా?' అనేది విచారణ చేయవచ్చును.

భ - అజ్ఞాని జగత్తును, అందులోని శబ్దస్పర్శాది ఇంద్రియ గోచరాలు అయిన విషయాలను చూస్తాడు, తెలుసుకుంటాడు. జ్ఞానికి కూడా అదే విధమైన ప్రపంచానుభవం వుంటుందా?

మ - జగత్తును చూడడం గురించి, తెలుసుకోవడం గురించి మాట్లాడుతున్నావు. తెలుసుకునేవాడు "జ్ఞాత." (జ్ఞాత లేకుండా ఇంద్రియ జ్ఞానం వుండదు) జ్ఞాతవు అయిన నిన్ను నీవు తెలుసుకోకుండా, జ్ఞేయ స్వరూపాన్ని నీవు ఎలా తెలుసుకోగలవు? నిజమే. విషయములు నీ దేహాన్ని, జ్ఞానేంద్రియాలను తాకుతున్నాయి.. అయితే, ఈ ప్రశ్నను లేవనెత్తింది దేహమా? "ఈ విషయం నాకు గోచరిస్తోంది. కనుక ఇది యథార్థం" అని దేహం చెబుతోందా? లేక "ఇదిగో జగత్తు అయిన నేను యథార్థంగా వున్నాను" అని జగత్తు వచ్చి నీతో చెబుతోందా?

భ - జగత్తు గురించి జ్ఞాని దృక్పథం ఏమిటో గ్రహించేందుకు, నేను ప్రయత్నిస్తున్నాను. ఆత్మసాక్షాత్కారం అనంతరం జగత్తు గోచరిస్తుందా?

మ- జగత్తును గురించి నీకు ఈ చింత ఎందుకు? ఆత్మసాక్షాత్కారం అయిన తరువాత అది ఏమైతే ఏమి? మొదట ఆత్మను సాక్షాత్కరింపచేసుకో. జగత్తు గోచరించనీ, గోచరింపకపోనీ, దానికేముంది? నిద్రలో నీకు ప్రపంచం కనిపించదు. అందువల్ల నీకు ఒరిగిందేమిటి? నీ అన్వేషణకు అది ఏమైనా దోహదకారిగా వుంటుందా? పోనీ, ఇప్పుడు నీకు ప్రపంచం కనిపిస్తోంది. దాని వలన నీకు పోయిందేమిటి? జ్ఞానికి అయినా, అజ్ఞానికి అయినా 'జగత్తును చూడడం, చూడకపోవడం' ఏమంత ముఖ్యమైన విషయం కాదు. ఇద్దరూ జగత్తును చూస్తారు. కానీ, వారి దృక్పథాలే వేరు.

భ - జ్ఞాని, అజ్ఞాని ఇద్దరికీ జగత్తు ఒకే విధంగా గోచరిస్తే, ఇక వారి మధ్య తేడా ఏమిటి?

మ-జ్ఞాని జగత్తును చూస్తూ, 'సమస్తానికీ ఆధారంగా వున్న ఆత్మను' చూస్తాడు. అజ్ఞాని జగత్తును చూసినా, చూడకపోయినా 'స్వస్వరూపమైన ఆత్మను ఎరుగడు.'

సినిమా ప్రదర్శనలో, తెరపైన కదిలాడే బొమ్మల దృష్టాంతాన్ని చూడు. ఆట మొదలుకాక ముందు, నీ ఎదుట వుండేది ఏమిటి? ఒక్క తెర మాత్రమే. ఆ తెరపైన, సినిమా ఆట మొత్తం చూస్తావు. చూడడానికి ఆ బొమ్మలన్నీ నిజమైనవిగానే వుంటాయి. కానీ, వెళ్ళి వాటిని పట్టుకోవడానికి ప్రయత్నించు. నీకు చిక్కేది ఏమిటి? నిజం అని తోచిన బొమ్మలు వున్న తెర మాత్రమే. ఆట ముగిసి, బొమ్మలన్నీ మాయమైనపుడు మిగిలేది ఏమిటి? మరల ఆ తెరయే!

అలాగే ఆత్మవిషయంలో కూడా. అది ఒక్కటే వుంది. బొమ్మలు వస్తాయి, పోతాయి. నీవు ఆత్మను పట్టుకొని వుంటే, చిత్రాలు గోచరించినందువలన వంచింపబడవు. అపుడు చిత్రాలు కనిపించినా, కనిపించకపోయినా ఫరవాలేదు. తెరను వుపేక్షించి, బొమ్మలను మాత్రమే చూసినపుడు, 'అవి తెరకు భిన్నంగా వున్నాయ'ని భ్రమించినట్లు; అజ్ఞాని ఆత్మను ఉపేక్షించి, 'జగత్తు సత్యమ'ని భావిస్తాడు. తెర లేకుండా బొమ్మలు లేనట్లుగా - "చూసేవాడు లేకపోతే, చూసేందుకు ఏమీ వుండద"ని తెలుసుకుంటే, నీవు భ్రాంతికి లోను కావు. తెర, తెరమీద బొమ్మలు, ఆ బొమ్మలను చూడటం ఇవన్నీ ఆత్మ మాత్రమే. చిత్రములతో కూడి, ఆత్మ వ్యక్త రూపంలో వుంటుంది. చిత్రములను వీడి అదే ఆత్మ, అవ్యక్త రూపంలో వుంటుంది."ఆత్మ వ్యక్తరూపంలో వున్నదా, అవ్యక్త రూపంలో వున్నదా?" అనేది జ్ఞానికి ముఖ్యం కాదు. అతడు ఎపుడూ ఆత్మయే. జ్ఞాని క్రియాశీలుడుగా వుండటం చూసి, అజ్ఞాని భ్రమకు గురి అవుతాడు.

భ - నా మొదటి ప్రశ్న వేసేందుకు ప్రేరేపించింది, సరిగ్గా ఈ అంశమే. ఆత్మ సాక్షాత్కారమైన వ్యక్తి, 'జగత్తును మేము ఎలా చూస్తామో, అలా చూస్తాడా?' అలాగే చూస్తే, నిన్న ఆశ్చర్యకరంగా మాయమైపోయిన ఫొటో విషయంలో భగవాన్ ఎలా భావించారో, నేను తెలుసుకోవాలనుకుంటున్నాను.

మ - (చిరునవ్వుతో) మధురై దేవాలయం ఫొటోను గురించి నీవు ప్రస్తావిస్తున్నావు. కొద్ది నిమిషాలకు ముందు అది ఆగంతుకుల నడుమ చేతులు మారుతున్నది. వారు దానిని ఒకరి తరువాత ఒకరు చూస్తున్నారు. అది వారు చూస్తున్న ఏదో ఒక పుస్తకంలోని పేజీల మధ్య ఎలాగో చిక్కుబడిపోయినట్లుంది.

భ - అవును. ఆ సంఘటన గురించే. భగవాన్ దానిని ఎలా పరిగణిస్తారు? ఫొటోకోసం ఆత్రుతగా వెదకటం జరిగింది. చివరికి అది దొరకనే లేదు. ఫొటో అలా తెలియకుండా మాయం కావడాన్ని, భగవాన్ ఎలా పరిగణిస్తారు? సరిగ్గా అది ఏ క్షణంలో కావాలనుకున్నారో, అపుడే అది కనిపించకుండా పోయింది. కదా!

మ - ఉదాహరణకు, నీవు నన్ను దూరదేశమైన మీ పోలెండుకు తీసుకొని పోతున్నట్లు కల గన్నావు. మేల్కొన్న తరువాత 'నాకు ఫలానా కల వచ్చింది. నేను మిమ్మల్ని పోలెండు తీసుకొని వెళుతున్నట్లు కలద్వారాగానీ, మరో విధంగాగానీ మీకు కూడా తెలిసిందా?" అని నన్ను అడుగుతావు. అటువంటి ప్రశ్నకు నీవు ఎలాంటి ప్రాముఖ్యాన్ని ఇస్తావు?

భ - కానీ, కనిపించకుండా పోయిన ఫొటోకు సంబంధించిన వ్యవహారం, అంతా భగవాన్ సమక్షంలోనే కదా జరిగింది!

మ - ఫొటోను చూడటం, అది మాయం కావడం, ఇపుడు నీవు ప్రశ్న అడగటం, ఇవన్నీ మనోవ్యాపార మాత్రములు.

ఈ అంశాన్ని విశదపరిచే పురాణగాథ ఒకటి వుంది: "సీత అడవిలోని పర్ణశాల నుండి కనిపించకుండా పోయినప్పుడు, రాముడు ఆమెను అన్వేషిస్తూ, 'సీతా, సీతా!' అని విలపిస్తూ బయలుదేరాడు. అడవిలో ఏమి జరుగుతున్నదో, పార్వతీ పరమేశ్వరులు పైనుండి చూసారు. పార్వతీదేవి ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ, శివుడితో ఇలా అంది: "నాథా! నీవు రాముడిని 'పరమాత్మ స్వరూపుడు' అని స్తుతించావు. చూడు, ఆయన ఎలా వ్యవహరిస్తున్నాడో, సీత కనిపించకపోతే, ఎలా దుఃఖిస్తున్నాడో?"

శివుడు ఇలా చెప్పాడు: "దేవీ! రాముని పరతత్త్వాన్ని గురించి నీకు సందేహం వుంటే, నీవే ఆయనను పరీక్షించు. నీ యోగమాయ వలన నీవే సీతా రూపాన్ని ధరించి, రాముడి ముందుకు వెళ్ళు." పార్వతీదేవి అలాగే చేసింది. సీతావేషం ధరించి, రాముని ముందు ప్రత్యక్షమైంది. రాముడు తాను గ్రుడ్డివాడు అన్నట్లుగా, ఆమెను చూడక ఉపేక్షించి, అంతకుముందులాగానే 'సీతా, సీతా' అని అరచుకుంటూ వెళ్ళిపోయాడు. పార్వతీదేవి నిర్ఘాంతపోయింది.

భ - ఈ కథలోని నీతి ఏమిటో నాకు అవగతం కాలేదు.

మ - రాముడు నిజంగానే, సీతాదేవియొక్క శారీరకమైన ఉనికిని వెతుకుతున్నట్లైతే, తాను పోగొట్టుకున్న సీతా రూపంలో తన ఎదుట నిలుచుని వున్న వ్యక్తిని ఆనవాలు పట్టి వుండేవాడు. లేదా కనిపించకుండా పోయిన సీత ఎంత అసత్యమో, కళ్ళ ఎదుట కనిపిస్తున్న సీత కూడా అంతే అసత్యం. రాముడు నిజంగా గ్రుడ్డివాడు కాదు. కానీ, జ్ఞాని అయిన రామునికి 'సీత పర్ణశాలలో వుండడం, కనిపించక పోవడం, ఆమెకోసం తాను వెతకడం, సీతా రూపంలో పార్వతి ఎదుటికి రావడం' ఇవన్నీ ఒకే విధంగా అసత్య మాత్రములే. కనిపించకుండా పోయిన ఫొటో గురించి ఏ రకంగా పరిగణింపబడిందో, ఇపుడు అవగాహనకు వచ్చిందా?

భ - అది పూర్తిగా స్పష్టమైందని చెప్పలేను. జగత్తు కళ్ళకు కనిపిస్తోంది, మనస్సుకు తోస్తోంది. ఇంద్రియాలకు అనేక రీతులలో అనుభవంలోకి వస్తోంది. అలాంటి ఈ జగత్తు ఏదో స్వప్నమువంటిదా? భ్రాంతి మాత్రమా?

మ - నీవు కేవలం సత్యాన్నే అన్వేషిస్తున్నట్లు అయితే, 'ఈ జగత్తు అసత్యం' అని అంగీకరించడం కంటే మరో దారి లేదు.

భ - ఎందువలన?

మ- కారణం సరళమైనదే. 'జగత్తు సత్యం' అనే భావం నిన్ను వదలిపెట్టకపోతే, నీ మనస్సు జగత్తు వెంటపడుతుంది. 'దృశ్యం సత్యం' అని నీవు భావిస్తే, వున్నది సన్మాత్రమే అయినా ఆ సత్ స్వరూపమును నీవు గ్రహించలేవు. ఈ అంశం

'రజ్జు సర్ప' దృష్టాంతంద్వారా విశదమవుతుంది. నీవు సర్పాన్ని చూసినంత కాలము, 'అది త్రాడు' అని నీవు చూడలేవు. లేని సర్పం నీకు వున్నట్లుగా గోచరిస్తుంది. నిజంగా వున్న రజ్జువు, అసలు లేనట్లుగా తోస్తుంది.

భ - చివరకు 'జగత్తు సత్యం కాద'నే విషయం, తాత్కాలికంగా అంగీకరించడం సులభమేగానీ, 'అది నిజంగానే అసత్యం' అనే విశ్వాసం కలగడం కష్టం.

మ - నీవు కల గనేటపుడు, 'స్వప్న జగత్తు కూడా నీకు సత్యం' అనే తోస్తుంది. స్వప్నం కొనసాగినంతకాలం నీవు చూసేది, తలచేది ప్రతీది నిజమే.

భ - అయితే జగత్తు స్వప్నముకంటే వేరు కాదా?

మ- కల గాంచినంతసేపూ అది నిజమని తోచడంలో తప్పు ఏముంది? అసంభవమైనది ఏదైనా, నీకు కలలో కనిపించవచ్చు. ఉదాహరణకు, చచ్చిపోయిన వ్యక్తితో హాయిగా ముచ్చటలాడుకున్నట్లు కల రావచ్చు. కలలోనే ఒక క్షణకాలం, 'అతడు చనిపోలేదా?' అని నీకు నీవే భావించుకొని సందేహించవచ్చు. అయినా ఎలాగో నీ మనస్సు స్వప్న దృశ్యంతో రాజీపడి, స్వప్నానుభవ నిమిత్తం ఆ వ్యక్తిని బ్రతికి వున్నవాడిగానే భావిస్తుంది.

మరో మాటలో చెప్పాలంటే, కల కలగా దాని సత్యత్వాన్ని అనుమానించ డానికి అవకాశం ఇవ్వదు. అలాగే నీ జాగ్రత్ అనుభవంలోని జగత్తు సత్యత్వాన్ని నీవు సందేహించలేకపోతున్నావు. తానుగా సృష్టించిన జగత్తును అసత్యమని, మనస్సు ఎలా ఒప్పుకుంటుంది? స్వప్న జగత్తును జాగ్రదనుభవంలో వున్న జగత్తుతో పోల్చి చెప్పటంలో గల ఉద్దేశ్యం ఇదే. రెండూ మనస్సు కల్పించినవే. రెండింటిలో మనస్సు దేనిలో నిమగ్నమై వుంటే, దానిని అంటే స్వప్నంలో వున్నపుడు స్వప్న యాథార్థ్యాన్ని, జాగ్రత్తులో వున్నపుడు జాగ్రత్ యాథార్థ్యాన్ని కాదనలేని స్థితిలో వుంటుంది. అలా కాకుండా, నీ మనస్సును జగత్తు నుండి పూర్తిగా వెనుకకు త్రిప్పు, లోపలికి మరల్చు. అక్కడే స్థిరంగా నిలిచి వుండు. అనగా నీ సమస్త అనుభవములకు ఆధారమై వున్న ఆత్మయొక్క స్ఫురణములో వుండు. ఆ స్థితిలో ఇపుడు నీవు దేనిని గురించి మాత్రమే ఎరిగి వున్నావో, ఆ జగత్తు నీకు నీ స్వప్నంలో అనుభూతమైన జగత్తులాగానే అసత్య మాత్రం అని తెలుస్తుంది.

భ - నేను ముందే చెప్పినట్లు, మనం జగత్తును అనేక రీతులుగా చూస్తున్నాము, తెలుసుకుంటున్నాము, (ఇండియాలద్వారా) గ్రహిస్తున్నాము. ఈ ఇంద్రియ అనుభవాలు విషయములను చూడడం, తెలుసుకోవడం మొదలైనవాటి వలన ఏర్పడే ప్రతిస్పందనలు. ఇవి కలలులాగా మనస్సు కల్పించినవి కావు. కలలు మనిషికి మనిషికి మారుతుంటాయి. అంతేకాదు. ఒక మనిషికి కూడా మారుతుంటాయి. జగత్తు వస్తుగతసత్యత్వం నిరూపించేందుకు ఇది చాలదా?

మ - ఈ పరస్పర వైరుధ్యాలను గురించి, వాటిని స్వప్న జగత్తుకు ఆపాదించడం గురించి చెప్పే ఈ మాటలన్నీ తలెత్తేది ఇపుడే, అనగా నీవు జాగ్రదవస్థలో వున్నప్పుడే. నీవు కల కనేటపుడు అది సాంగోపాంగమైన అనుభవంగానే వుంటుంది. నీకు కలలో దప్పిక అయితే, కలలో బూటకపు నీటిని బూటకంగా త్రాగితే, నీ బూటకపు దప్పిక (బూటకంగా) తీరుతుంది. 'ఆ కలయే ఒక బూటకం' అని నీవు తెలుసుకునేంతవరకు ఇదంతా యథార్థంగానే తోస్తుందిగానీ బూటకంగా తోచదు.

అలాగే జాగ్రత్ ప్రపంచంలో కూడా, నీకు ఇపుడు కలిగే ఇంద్రియానుభవాలు పరస్పరం సమన్వయం చెంది, 'జగత్తు సత్యం' అనే అభిప్రాయాన్ని నీకు కలిగిస్తాయి. అలా కాకుండా, ప్రపంచం స్వయంసిద్ధమై వున్న సత్ స్వరూపమైతే, (దాని దృశ్యత్వాన్ని గురించి నీకు వున్న భావం నిజానికి అదే) ప్రపంచం వచ్చి, కలలో నీకు తనను తాను వెల్లడి చేసుకోవడానికి ఆటంకం ఏముంటుంది? నిద్రలో నీవు లేవని నీవు చెప్పవు కదా!

భ - నేను నిద్రించే సమయంలో, 'ప్రపంచం లేద'ని కూడా చెప్పను. అది అన్ని వేళలా వుంటూనే వుంది. నేను నిద్రించేపుడు దానిని నేను చూడకపోయినా, నిద్రించకుండా వున్న ఇతరులు చూసారు.

మ- 'నీవు నిద్రలో వున్నావ'ని చెప్పేందుకు, 'నీ ఉనికిని నీకు ఋజువు పరచేందుకు' ఇతరుల సాక్ష్యాన్ని తీసుకొని రావలసి వుండునా? ఆ ఇతరుల సాక్ష్యాన్ని ఇపుడు ఎందుకు కోరుతున్నావు? ఆ 'ఇతరులు' నీవు నిద్రించేపుడు, తాము చూసిన జగత్తును గురించి నీవు మేల్కొన్న తరువాతనే కదా చెప్పగలుగుతారు నీకు? నీ ఉనికిని గురించిన విషయం వేరు. నిద్ర నుండి లేవగానే, 'నేను హాయిగా నిద్రపోయాను' అని చెబుతావు. ఆ మేరకు గాఢనిద్రలో సైతం నీ ఉనికిని గురించిన ఎరుక నీకు వున్నట్లే. కానీ, ఆ సమయంలో ప్రపంచపు ఉనికిని గురించి నీకు ఈషణ్మాత్రం అయినా స్పృహ లేదు. ఇపుడు కూడా, నీవు మేల్కొని వున్నపుడు, 'నేను వున్నాను' అని వచ్చి ప్రపంచం చెబుతున్నదా? లేక ఆ చెప్పేది నీవా?

భ - నిజమే, చెప్పేది నేనే. కానీ, నేను చెప్పేది జగత్తు గురించి!

మ - సరే. అయితే నీవు నిజమని చెబుతున్న ఆ ప్రపంచం, నిన్ను చూసి అపహాస్యం చేస్తోంది. ఎందుకంటే, నీ యాథార్థ్యాన్ని గురించి ఎరుగని నీవు, ప్రపంచంయొక్క యాథార్థ్యాన్ని ఋజువు చేయాలనుకుంటున్నావు.

ఎలాగైనా సరే, 'జగత్తు సత్యమే' అని నిరూపణ చేయడం నీ ఉద్దేశ్యం. 'ఇది సత్యం' అని చెప్పేందుకు ప్రమాణం ఏమిటి? అది స్వతహాగా సిద్ధమై వుండాలి, స్వసంవేద్యమై వుండాలి, నిత్యమై వుండాలి, నిర్వికారమై వుండాలి. అటువంటిది మాత్రమే సత్పదార్థము.

జగత్తు స్వతహాగా సిద్ధంగా వుందా? మనస్సుయొక్క సహాయం లేకుండా, అది ఎపుడైనా దృగ్గోచరమైందా? నిద్రలో మనస్సూ లేదు, జగత్తూ లేదు. మేల్కొన్న తరువాత మనస్సు వుంది, జగత్తు వుంది. నియతమైన ఈ అనుషంగమునకు అర్థం ఏమిటి? శాస్త్రీయ పరిశోధనలకు ఆధారభూతమైనవి అని భావింపబడే, అనుమేయ తర్క సూత్రాలు నీకు పరిచితమే. సర్వజనామోదకమైన ఆ తర్క సూత్రాలను బట్టి, జగత్ సత్యత్వ వివాదాన్ని పరిష్కరించుకోవచ్చును కదా!

'నేను వున్నాను' అని నిన్ను నీవు గురించి నీవు చెప్పవచ్చును. అంటే, నీది కేవలం ఉనికి మాత్రమే కాదు. నీ ఉనికిని గురించిన ఎరుక నీకు వుంది. నీ ఎరుకతో కూడిన ఉనికి నీది. వాస్తవానికి నీ ఉనికి, ఎరుకకు అభిన్నం.

భ - జగత్తుకు తనను గురించిన ఎరుక లేకపోవచ్చును. అయినా అది వుంది. మ - ఎరుక అంటే, ఎపుడూ తనను గురించిన ఎరుకయే. నీకు దేనిని గురించి అయినా ఎరుక వున్నదంటే, ముఖ్యంగా నిన్ను గురించిన ఎరుక నీకు వున్నట్లే. తనను గురించిన ఎరుక లేని ఉనికి స్వవచోవ్యాఘాతం. అది అసలు ఉనికియే కాదు. అది ఆరోపిత సత్త. నిజమైన సత్త లేదా సత్ అనేది గుణం కాదు. అది స్వరూపమే. అది వస్తువు. అందుకే సత్పదార్థం సత్చిత్తా తెలియబడుతుంది. ఒకటి వెలుపలగా, మరొకటిగా మరొకటి తెలియబడదు. జగత్తుకు తనది అయిన ఉనికి లేదు. అది తన ఉనికిని తాను ఎరుగదు. అటువంటి జగత్తు సత్యం అని నీవు ఎలా చెప్పగలవు? పైగా "జగత్ స్వభావం" ఏమిటి? అది నిరంతరం పరివర్తన శీలమైన, తెంపు లేని, అంతులేని ప్రవాహం. అది పరాధీనమైంది. ఆత్మస్ఫురణ రహితమైంది, ఎడతెగక మారుతుండేది అయిన జగత్తు సత్యం కాలేదు.

భ - పాశ్చాత్యుల భౌతికశాస్త్రం* 'ప్రపంచాన్ని సత్యం' అని చెబుతోంది. అంతేకాదు, వేదాలలో సృష్టి మూలాన్ని గురించి, సృష్టి క్రమాన్ని గురించి విస్తృతమైన వర్ణనలు వున్నాయి. ప్రపంచం అసత్యమైతే, అవి అలా ఎందుకు చెప్పడం?

మ- "అవినాశి అయిన ఆత్మస్వభావమును గురించి బోధించి, సాధికారికంగా 'తత్త్వమసి' (అది నీవే అయి ఉన్నావు) అని బోధించడం", వేదాలు మొదలైనవాటి ముఖ్యోద్దేశం.

భ - ఒప్పుకుంటాను. కానీ, 'ప్రపంచం సత్యం' అని భావించకపోతే, అంత సుదీర్ఘంగా సృష్టిక్రమాన్ని అల్లిక వేసి చెప్పటం ఎందుకు?

మ- నీవు ఏ సిద్ధాంతాన్ని నిజం అని ఒప్పుకుంటావో, దానిని నీ సాధనకై ఎంచుకో, మిగిలినదంతా వదలివేయి. ఆధ్యాత్మిక సాధకులలో అనేక తరగతుల వారు వుంటారు. అందరి మనస్సుయొక్క స్థితి ఒకే విధంగా వుండదు. శాస్త్రాలు అందరికి మార్గదర్శనం చేయవలసి వుంటుంది. నీవు ఒప్పుకోనటువంటి విషయాలను అర్థవాదాలుగా గ్రహించి, సమాధానపడు.
వివరణ (53వ పేజీలోని సూచిక)

విశ్లేషించి చూస్తే, చివరకు ఇంద్రియ గోచరమయ్యే ప్రపంచం 'స్థలం, కాలం' అనే రెండు తరగతులుగా చీలిపోయి వుంది. సర్ జేమ్స్ జీన్స్ 'ది న్యూ బ్యాక్ గ్రౌండ్ ఆఫ్ సైన్స్' అనే తన గ్రంథంలో, ఐన్స్టిన్ ప్రతిపాదించిన సాపేక్ష సిద్ధాంతం ఆధారంగా చేసిన ప్రయోగాలలో తేలిన సారాంశాన్ని ఇలా వివరించాడు:

"విషయ గ్రహణంకంటే భిన్నమైన స్థలం అంటూ ఏదీ లేదనీ, సంఘటనలను గురించిన అనుభవంకంటే భిన్నమైన కాలం అంటూ ఏదీ లేదని మనకు తెలుస్తోంది. 'స్థలం' మనస్సుయొక్క కల్పనా మాత్రమే అని గోచరమవుతోంది.

(మన దేహాలు స్థలములో వున్న పదార్థములు మాత్రమే - శ్లో. 16, సద్దర్శనము). 'స్థలము' అనేది ప్రకృతిలోని అస్మత్ ప్రత్యయముయొక్క అసంగత విస్తరణ. దానిద్వారా మనం చూసే పదార్థాల అమరికను అర్థం చేసుకొని, వివరించగలము.

'కాలం' రెండవ కల్పన. దానిద్వారా మనకు జరిగే సంఘటనలు, ఏ క్రమంలో అమరి వున్నాయో తెలుస్తుంది. (భూతకాలం, భవిష్యత్ కాలం లేకుండా 'కాలం' అనేది, సామాన్యార్థంలో ఒక మిథ్య మాత్రమే - శ్లో. 15, సద్దర్శనం)."

ఆధునిక విజ్ఞానశాస్త్రం "స్థల, కాలములను మనస్సుయొక్క కల్పనా మాత్రములు" అని చెబుతోంది. పదార్థములు, సంఘటనలు కూడా అదే విధంగా మనస్సుయొక్క కల్పితాలు. (చూడండి శ్లో.17,18 సద్దర్శనము). అవి స్థల, కాలములు లేకుండా వుండలేవు. దీనిని పాఠకులు గ్రహించగలరు.

పదార్థానికి, సామాన్యులు ఆపాదించే ఘనత్వ విషయంలో కూడా, ఆధునిక ప్రయోగాత్మక భౌతిక శాస్త్రం చేసిన నిర్ణయాల ద్వారా జవాబు లభిస్తుంది.

1. పరమాణువులోని మూలద్రవ్య స్వరూప స్వభావాలను గురించి, విజ్ఞాన శాస్త్రానికి ఏమీ తెలియదు. దానికి పరమాణువులోని వికిరణ ప్రక్రియను గురించి మాత్రమే తెలుసు. దానికి మూలం ఏమిటో తెలియదు.

2. పరమాణువులో నుండి శక్తి తరంగాలు, నిరంతరం అన్నివైపులకు ప్రసరిస్తుంటాయి. అందుచేత ఒక క్షణంలో వున్న ఎలక్ట్రానును, మరోక్షణంలోని అదే ఎలక్ట్రానుతో గుర్తుపట్టలేనిది అవుతుంది.

3. 'ఎలక్ట్రానులో పదార్థ ధర్మాలు వున్నాయ'ని సామాన్య బుద్ధికి అనిపిస్తోంది. కానీ, దానిలో ఆ ధర్మాలు బొత్తిగా లేవని ఇపుడు కనుగొనబడింది. ఎలక్ట్రాన్ కేవలం ఒక క్షేత్రం. దానిలో నుండి శక్తి తరంగ ప్రసరణం జరుగుతుంటుంది. (ఔట్లైన్ ఆఫ్ ఫిలాసఫీ - బెర్ట్రాండ్ రసెల్).

బెర్ట్రాండ్ రసెల్ ఈ క్రింది నిర్ణయానికి వచ్చాడు: "ముఖ్యంగా హైసెన్ బర్గ్, ష్రోడింజర్ అనే జర్మన్ శాస్త్రవేత్తల కారణంగా, 'పరమాణువు ఒక ఘన పదార్థం' అనే ప్రాతకాలపు భావం పత్తా లేకుండా పోయింది. 'పదార్థం' ఇప్పుడు కేవలం అమూర్తమైన ఒక భూతావేశంవంటిదై పోయింది."

ఈ దృష్ట్యా ఇంద్రియ గోచరమయ్యే జాగ్రత్ ప్రపంచానికి, స్వప్న ప్రపంచానికి మధ్య ఏమైనా మౌలిక వ్యత్యాసం వున్నదేమో పాఠకులే నిర్ణయించుకోవచ్చు. ఈ సందర్భంగా ఈ అధ్యాయంలో వివరించినదానితోపాటు, "నే నెవడను?" గ్రంథంలోని ఈ వాక్యం స్మరణీయం. "జాగ్రత్తు దీర్ఘం, స్వప్నము క్షణికం అగుట తప్ప రెండింటి మధ్య భేదం ఏమీ లేదు."

ఆధునిక విజ్ఞాన శాస్త్రం దీనినే సమర్థిస్తోంది. డా|| ఎడింగ్టన్ ఇదే సత్యాన్ని ఈ విధంగా ఉద్ఘాటించాడు. "భౌతిక శాస్త్రం, ఛాయాప్రపంచానికి సంబంధించినదై పోయిందని గ్రహించడమే, ఈనాడు మనం సాధించిన అత్యంత ప్రధానమైన అభివృద్ధి ... పదార్థ విజ్ఞాన శాస్త్ర రంగంలో సుపరిచితమైన మన జీవితపు ఛాయానాటక ప్రదర్శనను మనం వీక్షిస్తాము (సినిమా తెరమీద చిత్ర ప్రదర్శన అని భగవాన్ సెలవిచ్చారు.)

'నీడ' సిరా 'నీడ' కాగితం మీద సాగిపోతుండగా, నా 'నీడ' మోచేయి 'నీడ' బల్లమీద ఆన్చి వుంది' (ది నేచర్ ఆఫ్ ది ఫిజికల్ వరల్డ్).

## 5. హృదయమే ఆత్మ

భ - "హృదయం చైతన్య పీఠం అని, అది ఆత్మకు అభిన్నం" అని భగవాన్ బోధిస్తారు. హృదయం అసలు దేనిని సూచిస్తుంది?

మ- చైతన్య మూలాన్ని కనుగొనాలనే ఆసక్తి నీలో వుండడంచేత, హృదయాన్ని గురించిన ప్రశ్న తలెత్తుతోంది. లోతుల్లోకి వెళ్ళి, ఆలోచించాలని అనుకొనే వారందరికీ 'నేను'ను గురించిన విచారణ చేయడం, 'నేను' యొక్క లక్షణాన్ని తెలుసుకోవడం, వీటిపట్ల ఆకర్షణ అనివార్యంగా వుంటుంది.

'ఈశ్వరుడు, ఆత్మ, హృదయం, చైతన్యస్థానం' ఇలా ఏ పేరు పెట్టినా అంతా ఒక్కటే. గ్రహించాల్సిన అంశం ఇదే. అది నీ అంతస్సత్త్వం, కేంద్రం. అది లేకపోతే, ఇక మరొకటి ఏదీ లేదు.

భ - "హృదయం ఒక నిర్దిష్టమైన స్థానంలో వున్నదనీ, దేహంలో వక్షోమధ్యానికి రెండు వ్రేళ్ళు కుడివైపు అది వుంద"నీ శ్రీభగవాన్ చెప్పారు.

మ - అవును. అది ఆధ్యాత్మికానుభవానికి కేంద్రం. ఋషుల ప్రమాణాన్నిబట్టి ఇది చెప్పబడింది. ఈ ఆధ్యాత్మిక హృత్కేంద్రం 'హృదయం' అనే పేరుతో రక్తప్రసరణం చేసే మాంసికాంగం కంటే భిన్నమైనది. ఆధ్యాత్మిక హృత్కేంద్రం, దేహంలో ఒక అవయవం కాదు. అది నీ సత్తాలోని కేవల అంతస్సత్త్వము. హృదయాన్ని గురించి నీవు చెప్పగలిగిందంతా అంతే. నీవు మేల్కొని వున్నా, నిద్రిస్తున్నా, కలగంటున్నా, కార్యవ్యగ్రుడవై వున్నా, సమాధిలో లీనమై వున్నా, దానితో నీవు ఒకటై వుంటావు.

భ - అలా అయితే, దానిని దేహంలో ఒక ప్రత్యేక స్థలానికి పరిమితం చేయడం ఎలా కుదురుతుంది? హృదయానికి ఒక స్థానాన్ని నిర్దేశిస్తే, అది దేశకాలాతీతమైన తత్త్వాన్ని దేహగత పరిమితులకు లోను చేసినట్లు అవుతుంది.

మ - అది వాస్తవమే. కానీ, హృదయ స్థానాన్ని గురించి ప్రశ్నించే వ్యక్తి, తాను దేహంతో లేదా దేహంలో వున్నట్లు భావిస్తాడు. ఇపుడు నీవు ప్రశ్నిస్తున్నావు. నీ దేహం మాత్రమే ఇక్కడ వున్నదనీ, నీవు మరెక్కడి నుండో మాట్లాడుతున్నావనీ చెబుతావా? లేదు. శరీరంగా నీ ఉనికిని నీవు ఒప్పుకుంటున్నావు. ఈ దృష్టితోనే దేహాన్ని గురించిన ప్రసక్తి తీసుకొని రావలసి వస్తుంది.

నిజానికి 'శుద్ధచైతన్యం' అవిభాజ్యము, నిరవయవము. దానికి నిర్దిష్టమైన రూపురేఖలు లేవు. దానికి 'అంతరం లేదు, బాహ్యం లేదు. కుడి లేదు, ఎడమ లేదు.' హృదయం శుద్ధచైతన్యం. అది అన్నింటినీ తనలో ఇముడ్చుకుంటుంది. దానికి బాహ్యంగా, దానికి భిన్నంగా ఏదీ లేదు. అదే పరమ సత్యము.

ఈ నిరపేక్ష దృష్టితో చూసినపుడు హృదయం లేదా ఆత్మ లేదా చైతన్యం, దేహంలో ఫలానా చోట వుంటుందని నిర్దేశించి చెప్పడానికి వీలులేదు. కారణం ఏమిటి? మనస్సు తేజోమయమైన హృదయానికి అస్పష్ట ప్రతిబింబం. దేహం, మనస్సుయొక్క ప్రతిరూప మాత్రము, పరతత్త్వముయొక్క అతిసూక్ష్మ విషయావిష్కృతి. అటువంటి దేహంలోని

ఇంద్రియములచే గుర్తింపబడగల అల్పాల్ప భాగం లోపల, సర్వాన్నీ తనలో ఇముడ్చుకున్న హృదయం, ఇరుక్కొని వుంటుందని చెప్పగలమా?

అయితే జనులు దీనిని గ్రహించలేరు. వారు భౌతిక దేహమూ, జగత్తూ వీని పరిభాషలో ఆలోచించకుండా వుండలేరు. ఉదాహరణకు నీవు, 'హిమాలయాలకు ఆవల వున్న మా దేశం నుండి ఇంతదూరం ఆశ్రమానికి వచ్చాను' అని చెబుతావు. కానీ, వాస్తవం అది కాదు. నీవు సర్వవ్యాప్త చైతన్య స్వరూపుడవు. అటువంటి నీకు 'రావడం, వెళ్ళడం లేదా ఏదైనా చలనం' ఎక్కడ వుంటాయి? నీవు ఎపుడూ ఎక్కడైతే వున్నావో, అక్కడే వున్నావు. ఈ ఆశ్రమం చేరేవరకు కదలినది, ఒకచోటు నుండి మరొక చోటుకు తీసుకొని రాబడింది నీ శరీరమే.

ఇది సరళమైన సత్యము. కానీ, 'విషయ ప్రపంచంలో వుంటున్న ఒక విషయిగా' తనను తాను భావించుకొనే వ్యక్తికి, ఇదంతా ఊహాకల్పనగా తోస్తుంది. వ్యావహారిక స్థాయికి దిగి వచ్చి మాట్లాడేటప్పుడు, భౌతిక శరీరంలో ఒక చోటును నిర్దేశించి చెప్పడం జరుగుతుంది. 'హృదయం ఫలానా చోట వుంటుంది' అని.

భ - "వక్షస్సులోని ఒక నిర్దిష్ట స్థానంలో హృదయ కేంద్ర స్ఫురణ కలుగుతుంద"ని శ్రీభగవాన్ చెబుతారు. దానిని నేను ఎలా అర్థం చేసుకోవాలి?

మ - "హృదయం' దేశకాలాతీతమైన విశుద్ధ చైతన్యం" అనే సత్యాన్ని, పారమార్థిక దృక్కోణం నుండి ఒకసారి అవగాహన చేసుకొని అంగీకరిస్తే, మిగతాది అంతా సమ్యక్ దృష్టితో అర్థం చేసుకోవడం సులభమవుతుంది.

భ - అదే ప్రాతిపదికగా వుంచుకొని, నేను హృదయస్థానాన్ని గురించి ప్రశ్న వేసాను. శ్రీభగవాన్ అనుభవాన్ని గురించి తెలుసుకోవాలనుకుంటున్నాను.

మ - దేహమునకు భిన్నం, మనోతీతం అయిన 'శుద్ధ చిత్తు' అనుభవైకవేద్యమైన విషయం. అజ్ఞానికి దేహస్ఫురణ వుంటుంది. జ్ఞానికి దేహశూన్య సత్ తత్త్వ స్ఫురణ వుంటుంది. అయితే చిత్ స్వరూపానుభవం దేహ స్ఫురణ వున్నపుడూ వుండవచ్చు, లేనపుడూ వుండవచ్చు. శుద్ధచిత్ స్వరూపం యొక్క దేహశూన్యానుభవంలో, జ్ఞాని దేశకాలాతీతంగా వుంటాడు కాబట్టి, హృదయ స్థానమును గురించిన ప్రశ్న తలెత్తదు.

చైతన్యమును విడిచి, స్వతంత్రంగా దేహం ప్రాణంతో మనలేదు. దేహస్ఫురణ శుద్ధచైతన్యము వల్లనే నిలుస్తుంది. మొదటిది శరీర అవధిగా వుంటుంది. రెండవది అనంతం, నిత్యం. కనుక మొదటిది రెండవదానితో సమస్థానీయంగా వుండలేదు.

అణుసమమైన శరీర చైతన్యం, శుద్ధ చైతన్యానికి సూక్ష్మాకార ప్రతిబింబం. ఆ శుద్ధచైతన్యంతో జ్ఞాని తాదాత్మ్యం చెంది వుంటాడు. స్వయంప్రకాశ అనంత చైతన్య స్వరూపుడైన జ్ఞానికి 'దేహచైతన్యం' ఒక ప్రతిబింబిత కిరణం మాత్రమే. ఈ అర్థంలోనే జ్ఞాని దేహస్ఫురణ కలిగి వుంటాడు.

శుద్ధ చిత్స్వరూపంగా, హృదయ సంయోగం వలన దేహశూన్యానుభవం పొందుచున్నపుడు, జ్ఞానికి దేహస్ఫురణ వుండదు. ఆ పూర్ణానుభవం, తాను దేహస్ఫురణలో వున్నపుడు, ఒకానొక పూర్వానుభవ స్మృతిరూప వృత్తి (పూర్వజ్ఞానం) ద్వారా భౌతిక శరీర పరిధికి సమితము (Localized) చేయబడుతుంది.

భ - హృదయమును గురించి ప్రత్యక్షానుభూతిగానీ, ఆ అనుభవ స్మృతిగానీ లేని నావంటివారు, ఈ విషయాన్ని అర్థం చేసుకోవడం ఎలాగైనా కష్టమే అని తోస్తున్నది. హృదయ స్థానాన్ని గురించి బహుశ మేము ఏవో ఊహాగానాల మీద ఆధారపడవలసి వుంటుంది.

మ- అజ్ఞాని విషయంలో కూడ, హృదయస్థాన నిర్ణయం కోసం ఊహాగానాలపై ఆధారపడవలసి వస్తే, ఇది ఆలోచించదగినది కానేకాదు. నీవు ఆధారపడవలసింది. అంచనాలమీద కాదు. అమోఘమైన నీ సహజజ్ఞానం మీద.

భ - సహజ జ్ఞానం ఎవరికి?

మ- అందరికీ.

భ - హృదయమును గురించిన సహజ జ్ఞానం నాకు వుందని శ్రీభగవాన్ అభిప్రాయమా?

మ- కాదు. హృదయమును గురించి కాదు. నీ గుర్తింపుకు సంబంధించిన హృదయ స్థానమును గురించి.

భ - అంటే, దేహంలో హృదయం వుండే చోటు గురించి, నాకు సహజంగానే తెలుసునని శ్రీభగవాన్ అంటున్నారా?

మ- ఎందుకు కాదు?

భ - (తనను చూపించుకుంటూ) నాకే స్వయంగా అనేనా శ్రీభగవాన్ పేర్కొంటున్నది?

మ- అవును. సహజ జ్ఞానం అంటే అదే! నిన్ను నీవు సైగద్వారా ఎలా చూపించావు? నీ వ్రేలిని నీ వక్షస్సు కుడివైపున వుంచలేదా? హృదయ కేంద్రం. వుండే చోటు సరిగ్గా అదే.

భ - అయితే హృదయ కేంద్రాన్ని గురించిన ప్రత్యక్షానుభవం లేనపుడు, నేను ఈ సహజ జ్ఞానంపై ఆధారపడాలి?

మ- అందులో తప్పేముంది? బడిలో పిల్లవాడు, 'లెక్క సరిగ్గా చేసింది నేనే' అని చెబుతాడు. లేదా, 'నేను పరుగెత్తి వెళ్ళి పుస్తకం తెచ్చి ఇవ్వనా నీకు' అంటాడు. అపుడు లెక్క వేసింది తల అని, అతడు తన తలను చూపిస్తాడా? లేదా కాళ్ళను చూపిస్తాడా? అవి తనను త్వరగా మోసుకెళ్ళి పుస్తకాన్ని తెస్తాయని?' లేదు. ఈ రెండు సందర్భాలలోను, సహజంగా అతని వ్రేలు వక్షస్సు కుడివైపున చూపిస్తుంది. అలా అతనికి తెలియకుండానే, తన 'నేను' తనముయొక్క మూలము అక్కడ వుందనే గంభీర సత్యాన్ని వెల్లడిస్తాడు. భ్రాంతి లేని సహజ జ్ఞానం ఇది. దీనివల్లనే అతడు ఆత్మ అయిన హృదయం, అక్కడ వుందని చూపిస్తాడు. ఆ చర్య అసంకల్పితమైంది, విశ్వజనీనమైంది. అంటే ప్రతి మనిషిలోను అది ఒకే విధంగా వుంటుంది.

దేహంలో హృత్కేంద్రం ఫలానా చోటులో వుంటుందని చెప్పడానికి, ఇంతకు మించి ఋజువు నీకు ఇంకేమి కావాలి?

## 6. హృదయం ఉండే చోటు

భ - తన భ్రూమధ్యంలో ఆధ్యాత్మికానుభవం కలిగిందని ఒక మహాత్ముడు చెప్పగా నేను విన్నాను.

మ- నేను లోగడ చెప్పినట్లుగా పరమాత్మ సాక్షాత్కారం, దృగ్దృశ్య సంబంధమునకు అతీతమైన స్థితి. అది ప్రాప్తమైన తరువాత ఆధ్యాత్మికానుభూతి ఎక్కడ పొందితే ఏమిటి?

భ - ఆధ్యాత్మికానుభవ కేంద్రము 1) భ్రూమధ్యములోనా లేదా 2) హృత్కేంద్రములోనా? ఈ రెండింటిలో ఏది సరైన అభిప్రాయం? నేను తెలుసుకోవాలనుకుంటున్న విషయం ఇది.

మ- అభ్యాసం నిమిత్తం, నీవు భ్రూమధ్యంలో దృష్టి నిలిపి ధ్యానం చేయవచ్చు. అయితే అది అపుడు మనోభావన మాత్రమే అవుతుంది. కానీ, పరమానుభవ స్థితిలో, అనగా సాక్షాత్కార స్థితిలో నీవు ఆ పరతత్త్వంతో ఒకటైపోతావు. నీ

జీవభావన విలీనమైపోతుంది. మనోతీతమైన స్థితి అది. అపుడు, అనుభవానికి వచ్చేందుకు దృశ్యరూపంగా ఒక కేంద్రం, దానికి భిన్నంగా దృగ్రూపంలో నీవు ఇలా రెండు వుండవు.

భ - నా ప్రశ్నను కొద్దిగా మార్చి, వేరు మాటల్లో అడుగుతాను. భ్రూమధ్య స్థానాన్ని ఆత్మపీఠంగా పేర్కొనవచ్చునా?

మ - చైతన్యానికి ఆదిమూలం ఆత్మ అని, అది మనస్సు సంబంధితములైన అవస్థా త్రయములో సమాన రూపంలో నిలిచి వుంటుందని నీవు అంగీకరిస్తున్నావు. అయితే ధ్యానంలో వున్న వ్యక్తికి నిద్ర ముంచుకొని వస్తే, ఏమవుతుందో గమనించు. నిద్ర వచ్చే సూచన కనిపించీ కనిపించగానే, అతని తల ఊగడం మొదలవుతుంది. భ్రూమధ్యములోగానీ లేదా తలలోగానీ లేదా ఏదో స్థలంలోగానీ ఆత్మచైతన్యం వున్నట్లైతే, అలా జరుగదు.

నిద్రాసమయంలో కనుబొమ్మల మధ్య ఆత్మానుభూతి కలుగకపోతే, ఆ కేంద్రం ఆత్మస్థానం అని చెప్పుటకు వీలులేదు. అలా చెబితే, ఆత్మ తన స్వస్థానాన్ని తరచు వదలి వెళ్ళిపోతుందని చెప్పినట్లే. అది అనుపపన్నమైన మాట.

సత్యం ఏమిటంటే, సాధకుడు ఏదో కేంద్రంలో లేదా ఏదో చక్రంలో తన మనస్సును నిలుపుతాడు. అతనికి అక్కడే ఆత్మానుభవం కలుగుతుంది. అంతమాత్రంచేత, అతని అనుభవస్థానమే ఆత్మస్థానం అని చెప్పుటకు వీలు కాదు.

సంత్ కబీర్ కుమారుడైన కమల్కు సంబంధించి ఆసక్తికరమైన కథ ఒకటి వుంది. తలనుగానీ, భ్రూమధ్యముగానీ ఆత్మస్థానంగా భావించే వీలులేదని చెప్పడానికి అది ఉదాహరణగా వుంటుంది.

'కబీర్' గొప్ప రామభక్తుడు. తన ఇష్టదైవం అయిన రాముడిని స్తుతించే సాధువులకు అన్నం పెట్టడం, కబీర్కు వ్రతంగా వుండేది. అతడు ఈ విషయంలో ఎపుడూ అశ్రద్ధ చూపించేవాడు కాదు. ఒక పర్యాయం భక్తబృందానికి భోజనం ఏర్పాటు చేయడానికి, కావలసిన పదార్థాలు కబీర్ ఇంట్లో నిండుకున్నాయి. ఏ విధంగా అయినా సరే, మర్నాటి ఉదయం లోపల కావలసిన ఏర్పాట్లు అన్ని పూర్తి చేయవలసి వుంది. అతనికి మరోదారి లేదు. అందుకోసం, కబీర్, అతని కుమారుడు కలిసి కావలసిన పదార్థాలను సంగ్రహించుకొని వచ్చేందుకు, ఆ రాత్రివేళ బయలుదేరారు.

తండ్రి కొడుకులు ఇద్దరూ ఒక వ్యాపారస్థుని ఇంటికి కన్నం వేసి, కావలసిన సరుకులు బయట పడేసారు. కుమారుడు ఇంటివారిని లేపడానికి లోపలికి వెళ్ళాడు. వారిని లేపి, 'మీ ఇంట్లో ఇలా దొంగతనం చేసామ'ని చెప్పడం ధర్మం అని అతని భావన. అలాగే అతను ఇంటివారిని లేపాడు. విషయం చెప్పి, తప్పించుకొని వెళ్ళేందుకు కన్నంలో దూరాడు. వెంటనే తండ్రివద్దకు చేరాలని అతని తాపత్రయం. కానీ, అతని శరీరం కన్నంలో ఇరుక్కొంది. వెంటబడిన ఇంటివారు తమను గుర్తుపట్టకూడదు. గుర్తుపట్టి పట్టుకుంటే, మర్నాడు సాధువులకు అన్న సమారాధన ఆగిపోతుంది. అందుచేత కుమారుడు తండ్రిని పిలిచి, "తన తల నరికి తీసుకొని వెళ్ళమ"ని చెప్పాడు. కబీర్ అలాగే చేసి, దొంగిలించిన సరుకులతో, తెగిన కొడుకు తలతో తప్పించుకొని, ఇంట్లోకి వచ్చాడు. కొడుకు తలను, ఎవరూ చూడకుండా దాచిపెట్టాడు.

మర్నాడు కబీర్, భక్తులందరికీ విందు ఏర్పాటు చేసాడు. ఆ క్రితం రాత్రి జరిగిన సంగతిని గురించి ఏమీ పట్టించుకోలేదు. 'నా కుమారుడు మరణించాలని రాముడి సంకల్పం అయినట్లైతే, అలాగే జరుగుతుంది' అని తనలో తాను అనుకున్నాడు. ఆ రోజు సాయంత్రం కబీర్ భక్తబృందంతో కలిసి, మామూలు ప్రకారం భజనలు మొదలైనవి చేసుకుంటూ, ఊరేగింపుగా ఊర్లోకి వెళ్ళాడు.

ఇంతలో దొంగతనం జరిగిన ఇంటివారు, రాజుగారికి ఫిర్యాదు చేసారు. తల తెగిన కమల్ మొండెమును వారు రాజుగారి ముందు వుంచారు. ఆ మొండెం వలన, వారికి ఏ రకమైన ఆచూకీ దొరకలేదు. ఆ మొండెం ఎవరిదో గుర్తు పట్టేందుకు రాజాజ్ఞానుసారం, దానిని రహదారిలో అందరికీ కనిపించేలా వ్రేలాడ దీసారు. దానిని ఎవరు గుర్తుపట్టి తీసుకొని వెళతారో, వారిని విచారించి రాజభటుల ద్వారా నిర్బంధించవచ్చుననే ఉద్దేశ్యంతో. రాజభటులను రహస్యంగా ఆ ప్రాంతంలో కాపలా వుంచారు. శవానికి అంత్యక్రియలు జరపకుండా, బంధువులు ఎవరూ ఉపేక్షించి ఊరుకోరు, కనుక ఇలా చేసారు.

కబీర్, ఆయనతోపాటు వారి భజన బృందమూ భక్త్యావేశంతో సంకీర్తనం గావించుకుంటూ, ఆ రహదారిలోకి వచ్చారు. వారు భజన చేస్తుంటే, అక్కడ ప్రేలాడదీయబడ్డ కమల్ మొండెం కూడా, భజన బృందంవారి తాళానికి అనుగుణంగా చప్పట్లు కొట్టసాగింది. అందరూ ఈ దృశ్యాన్ని చూసి నిర్ఘాంత పోయారు.

"ఆత్మస్థానం' తలలోగానీ, భ్రూమధ్యములోగానీ వున్నదనే అభిప్రాయం తప్పు" అని ఈ కథ ఋజువు చేస్తోంది. ఇంకో విషయాన్ని కూడా గమనించవచ్చు. యుద్ధ రంగంలో పోరాడుతున్న సైనికుడి తల, అకస్మాత్తుగా పదునైన కత్తి ప్రేటుకు తెగి శరీరం నుండి వేరుచేయబడితే, ఆ మొండెం అదే విధంగా పరిగెత్తుతూ, అవయవ చాలనం చేస్తూ వుంటుంది. కొద్దిసేపటి వరకు వ్యాజయుద్ధంలో లాగా. తరువాత అది నేల వ్రాలిపోతుంది.

భ - కానీ, కమల్ చనిపోయి అప్పటికి, చాలా గంటల సమయం దాటిపోయింది. కదా?

మ - 'నీవు మరణం' అని చెప్పేది, కమల్కు అసాధారణమైన అనుభవం ఏమీ కాదు. అతడు ఇంకా చిన్నవాడుగా వున్నపుడు, జరిగిన సంగతి ఒకటి వుంది.

బాలుడైన కమల్కు, సమాన వయస్కుడైన స్నేహితుడు ఒకడు వున్నాడు. కమల్ అతనితో గోలీలాట మొదలైనవి ఆడుకుంటూ వుండేవాడు. ఆటలలో వారు ఒక నియమాన్ని పెట్టుకున్నారు. ఒకరు మరొకరికి ఆటలు బాకీ వుంటే, వాటిని మర్నాడు తీర్చాలి. ఒకనాటి సాయంకాలం ఆటలాడుకోవడం అయిన తరువాత కమల్కు అతని మిత్రుడు ఒక ఆట బాకీ పడ్డాడు. మర్నాడు కమల్ మిత్రుని ఇంటికి వెళ్ళాడు. తనకు బాకీ పడిన ఆటను తిరిగి పొందేందుకు. అక్కడ అతని మిత్రుడిని వరండాలో పడుకోబెట్టి వుండటం చూసాడు. అతని బంధువులు దగ్గరనే కూర్చుని విలపిస్తున్నారు.

“ఏమి జరిగింది?" అని కమల్ వారిని అడిగాడు. "గత సాయంత్రం నాతో ఆడాడు. నాకు ఒక ఆట బాకీ వున్నాడు" అని చెప్పాడు. బంధువులు ఇంకా రోదిస్తూ “పిల్లవాడు మరణించాడు" అన్నారు. “లేదు, అతను చనిపోలేదు. చనిపోయినట్లు నటిస్తున్నాడు. నాకు బాకీ వున్న ఆటను ఎగ్గొట్టాలని ఇలా చేస్తున్నాడు" అని కమల్ అన్నాడు. బంధువులు, "లేదు, పిల్లవాడు నిజంగానే చనిపోయాడు. నీవే వచ్చి చూడు. ఒళ్ళు అంతా చల్లబడిపోయింది. బిగుసుకొని పోయింది" అని చెప్పారు. “ఇదంతా నటన. నాకు తెలుసు. శరీరం బిగిసిపోతే నేమి, చల్లబడితేనేమి? నేను కూడా అలాగే కాగలను" అని కమల్ చెప్పి, తాను కూడా క్రింద పడుకొని త్రుటి కాలంలో ప్రాణాలు వదిలాడు.

పాపం ఆ బంధువులు, ఇంతవరకు తమ పిల్లవాడు చనిపోయినందుకు రోదిస్తున్నారు. ఇపుడు అనుకోకుండా కమల్ మరణించేసరికి, నిశ్చేష్టులై, దుఃఖంతో అతనికోసం కూడా రోదించసాగారు. కానీ, కమల్ వెంటనే లేచి కూర్చుని, “చూసారా! నేను మరణించానని ఇంతవరకు అనుకున్నారు. కానీ, మరల లేచాను. సజీవంగా త్రుళ్ళుతూ వున్నాను. అతను కూడా ఇలాగే చేసి, నన్ను మోసం చెయ్యాలని చూస్తున్నాడు. కానీ, అతను అలా తన నటనతో నానుండి తప్పించుకోలేడు" అన్నాడు.

చివరకు, కథలో కమల్ మాహాత్మ్యం వలన, అతని మిత్రుడు బ్రతికి వచ్చాడు. కమల్ తనకు బాకీ వున్న ఆటను చెల్లించుకున్నాడు. "శరీరం మరణించినంత మాత్రాన ఆత్మ నశించదన్నదే ఇందులో వున్న నీతి. దేహసంబంధం కారణంగా, ఆత్మకు జనన మరణాలు సంభవించవు. దేహంలో ఒకానొక స్థానంలో పొందిన అనుభవం కారణంగా, ఆత్మ ఆ స్థానానికే పరిమితమై పోదు. భ్రూమధ్యంలో దృష్టి నిలిపి, ధ్యానాన్ని అభ్యసించడం వలన, అక్కడే ఆత్మపీఠం వున్నది అనుకోకూడదు. పరమాత్మ జ్ఞానం లేని స్థితి అంటూ లేదు. అవస్థాత్రయం, జీవనం, మరణం వీటికి అతీతంగా అది వుంటుంది.

భ - "ఆత్మస్థానం' హృదయంలో వున్నా, ఆ ఆత్మ ఏ కేంద్రం నుండి అయినా లేదా ఏ చక్రంలో నుండి అయినా వ్యవహరించవచ్చున"ని శ్రీభగవాన్ సెలవిచ్చారు. అలా అయితే, భ్రూమధ్యములో చేసిన తీవ్రధ్యానాభ్యాస ఫలితంగా, 'భ్రూమధ్యమే ఆత్మస్థానం' కావచ్చును కదా?

మ - 'దృష్టిని నిలిపి వుంచేందుకు ఒక స్థలాన్ని నిర్ణయించుకొని, దానిని ధ్యానం చేయడం' అనేది ఒక దశ. ఆ దశ కొనసాగినంతకాలం, ఆత్మస్థానాన్ని గురించిన విచారణ, కేవలం సైద్ధాంతిక చర్చగా మిగిలిపోతుంది. ఈ దశలో నీవు ద్రష్టవు అని భావిస్తావు. నీ దృష్టి నిలిపి వుంచే చోటు, నీవు చూసే దృశ్యం. ఇది ఒక భావన మాత్రమే. అలా కాకుండా, నీవు చూసేవాడిని చూస్తావు అనుకో. నీవు ఆత్మలో విలీనం అవుతావు, ఆత్మతో ఒకటై పోతావు. అదే హృదయం అంటే.

భ - అలాంటపుడు, భ్రూమధ్యములో దృష్టిని కేంద్రీకరించి, సాధన చేయమనే సలహా సరైనదేనా?

మ - ఏ రకమైన ధ్యాని సాధనయొక్క అంతిమ ఫలమైనా, సాధకుడు ఏ విషయం మీద అతని మనస్సును లగ్నం చేస్తాడో, ఆ విషయం ధ్యానించేవానికి భిన్నంగా, వేరుగా వుండకపోవడమే. అవి (ధ్యానించేవాడు మరియు ధ్యానింప బడేది) ఒకే ఆత్మగా అవుతాయి - అదే 'హృదయము.'

భ్రూమధ్యములో దృష్టిని కేంద్రీకరించి ధ్యానం చేయడం, సాధనా పద్ధతులలో ఒక పద్ధతి. దాని వలన తలపులు తాత్కాలికంగా నిగ్రహింపబడతాయి. దానికి కారణం ఒక్కటే. ఏ తలపైనా మనోవ్యాపారమే. తలపు 'చూపు'ను అనుసరిస్తుంది. అది లోచూపుగానీ, పై చూపుగానీ.

అయితే ఒకటి గుర్తుంచుకోవాలి. భ్రూమధ్యములో దృష్టిని నిలిపి చేసే సాధనకు, జపాన్ని కూడా జోడించాలి. మనస్సును నిగ్రహించడంలో లేదా మనస్సును కలవరపెట్టడంలో కన్ను తరువాత, చెవి ప్రాధాన్య వహిస్తుంది. నిగ్రహించి మనస్సుకు బలం చేకూర్చడంలోగానీ లేదా కలవరపెట్టి నిర్వీర్యం చేయడంలోగానీ ప్రాధాన్యత వహించేది మనోనేత్రం (Eye of mind), తరువాత మనశ్శోత్రం (Ear of mind). మనోనేత్రం అనగా ఒక విషయ వస్తువును మానసికంగా చూడడం. అలాగే మనశ్శోత్రంగా వాక్కును మనస్సులో మాట్లాడడం (Mental articulation of speech). అందువలన మనోనేత్రాన్ని ఒక కేంద్రంలో, ఉదాహరణకు భ్రూమధ్య స్థానంలో నిలిపినపుడు, మానసికంగా ఒక నామాన్ని లేదా ఒక మంత్రాన్ని జపించాలి. లేకపోతే ధ్యానవిషయం నుండి నీ పట్టు సడలిపోతుంది.

పైన వివరించిన విధంగా చేసే సాధనలో నామం, శబ్దం లేదా ఆత్మ దానికి నీవు ఏ పేరు పెట్టినా - ధ్యానం కొరకు ఎన్నుకొన్న కేంద్రంతో తాదాత్మ్యం చెందుతుంది. శుద్ధచైతన్యం, ఆత్మ లేదా హృదయం చరమ సాక్షాత్కారం.

భ - ఏదో ఒక చక్రంపైన దృష్టి నిలిపి సాధన చేసేందుకు, శ్రీభగవాన్ మమ్మల్ని ఆదేశించరు, ఎందుచేత?

మ - "సహస్రారం లేదా మెదడు ఆత్మస్థానం" అని యోగశాస్త్రాలు చెబుతాయి. "హృదయమే ఆత్మస్థానం" అని పురుష సూక్తంలో వుంది. సాధకునికి కలుగబోయే సందేహాన్ని నివారించడంకోసం, 'నేను' యొక్క లేదా 'నేను వున్నాను' యొక్క సూత్రాన్ని, జాడను పట్టుకోవలసిందని నేను చెబుతాను. దానిని అనుసరించి, దాని మూలాన్ని చేరుకోవాలి. ఎందుకంటే, 'నేను' తలపును గురించి ఎవరికీ ఎటువంటి సందేహమూ రాదు, అది అసంభవం. ఇది మొదటి విషయం. సాధకుడు ఏ సాధనా పద్ధతిని అనుసరించినప్పటికీ, అంతిమ ధ్యేయం ఏమిటి? అనుభవాలన్నింటికీ ప్రాథమిక దత్తాంశమై వున్న "నేను వున్నాను" అనే భావన యొక్క మూలాన్ని సాక్షాత్కరింప చేసుకోవడమే.

అందుచేత నీవు ఆత్మవిచారాన్ని అభ్యాసం చేస్తే, ఆత్మ అయిన హృదయాన్ని చేరుకోగలవు.

## 7. అహం, అహం వృత్తి

భక్తుడు - అహంత ద్వారా చేసే విచారణ ద్వారా, అహంతయొక్క అసత్యత్వం ఎలా తెలుస్తుంది?

మహర్షి - అహంవృత్తి ఎక్కడ నుండి లేస్తుందో, ఆ మూలంలో మునిగినట్లైతే, వున్నట్లు తోచే అహంతను నీవు అధిగమిస్తావు.

భ - అహంతకు వున్న మూడు రూపాల్లో అహంవృత్తి ఒకటి కాదా? యోగవాసిష్ఠం మొదలైన శాస్త్రాలు అహంత మూడు రూపాల్లో వుంటుందని పేర్కొన్నాయి.

మ - అవును. అహంతకు మూడు రూపాలు వున్నాయని చెప్పారు. అవి స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలు. అయితే, అది కేవలం విషయ విశ్లేషణ నిమిత్తమే. ఆత్మవిచారణ, అహంతయొక్క రూపంపై ఆధారపడినట్లైతే, విచారణ అసంభవం అవుతుంది. ఎందుకంటే, అహంత ధరించే రూపాలు అనంతం. కాబట్టి అహంతకు వున్నది అహంవృత్తి రూపం ఒకటే అన్న ప్రాతిపదికపైన నీవు ముందుకు సాగాలి.

భ - జ్ఞానప్రాప్తికి అది చాలకపోవచ్చును.

మ - అహంవృత్తియొక్క జాడను వెన్నంటి చేసే ఆత్మవిచారణ - వాసనను పసిగట్టి యజమానిని గుర్తించే కుక్కను పోలి వుంటుంది. యజమాని దూరాన వుండవచ్చు లేదా తెలియనిచోట వుండవచ్చు. అయినా యజమానిని గుర్తించడంలో, అవేమీ కుక్కకు అడ్డుగా నిలువవు. యజమాని వాసన కుక్కకు తిరుగులేని ఆచూకి. యజమాని ఏ దుస్తులు వేసుకున్నా, అతని శరీర నిర్మితి, ఎత్తు మొదలైనవి ఎలా వున్నా, వాటితో దానికి పని లేదు. చెదరని దృష్టితో వాసనను బట్టి, కుక్క యజమానిని వెతుకుతుంది. చివరకు అతని జాడ కనిపెట్టడంలో సఫలం అవుతుంది.

భ - ఇతర వృత్తులకంటే అహంవృత్తియొక్క మూలాన్వేషణమే, ఆత్మసాక్షాత్కారానికి ప్రత్యక్ష సాధనం అని చెప్పడం ఎందుకు? ఈ ప్రశ్న ఇంకా అలాగే మిగిలి పోయింది.

మ- 'అహం' అనే పదమే ఎంతో భావగర్భితమైంది. ఈ శబ్దంలో 'అ', 'హ' అనే రెండక్షరాలు సంస్కృత వర్ణమాలలోని మొదటి, చివరి అక్షరాలు. అందులోనే అంతా వుంది అని సూచించే శబ్దం అది. "అహం" అంటే అస్తిత్వమే. "అహంత (నేను) లేదా అస్మిత (నేను వున్నాను) అనేది వ్యవహారంలో అహంవృత్తిగానే తెలియబడుతున్నా, మనస్సులోని ఇతర వృత్తులవలె అది నిజంగా ఒక వృత్తి కాదు. ఇతర వృత్తుల మధ్య అన్యోన్య సంబంధం వుండదు. కానీ, మనస్సులోని ప్రతి వృత్తితోను అహంవృత్తికి ఒకే రీతిలో ఘనిష్ట సంబంధం వుంటుంది. అహంవృత్తి లేకపోతే, ఏ ఇతర వృత్తి వుండదు. మనస్సులోని ఏ ఇతర వృత్తిపై ఆధారపడకుండా, అహంవృత్తి స్వతంత్రంగా నిలిచి వుండగలదు. అందుచేత అహంవృత్తి ఇతర వృత్తులకంటే మౌలికంగా భిన్నమైనది. అందుచేత, 'అహంవృత్తి మూలాన్వేషణ' అంటే అహంతా రూపాలలో ఒకదాని కుదురు ఏమిటో దానిని వెతుకుట మాత్రమే కాదు, అహం స్ఫురణ (అస్మిత) దేనినుండి ఉత్పన్నమవుతుందో, ఆ మూలాన్ని అన్వేషించడం. మరొక మాటలో చెప్పాలంటే, అహంవృత్తి రూపంలో వున్న అహంతయొక్క మూలాన్ని వెతకి సాక్షాత్కరింపచేసుకోవడం ద్వారా, అనేక రూపాలుగా వుండే అహంతను నీవు అధిగమిస్తావు."

భ - అహంవృత్తియే సకలమైన అహంతా రూపాలను తనలో ఇముడ్చుకొని వుంటుందని అంగీకరించినా, ఆత్మవిచారణకోసం అహంవృత్తిని మాత్రమే ఎందుకు ఎంపిక చేసుకోవాలి?

మ- నీ సర్వానుభవముల క్రోడీకృతి అయిన మౌలిక దత్తాంశం అదే కాబట్టి. ఆత్మసాక్షాత్కారం కోసం నీవు అవలంబించదగిన ఆచరణీయ విధానం, దాని మూలాన్ని అన్వేషించడం ఒక్కటే కాబట్టి. అహంతకు కారణ శరీరం ఒకటి వున్నదని చెబుతారు. దానిని నీవు నీ అన్వేషణ విషయంగా ఎలా చేసుకోగలవు? అహంత కారణ శరీరాన్ని గ్రహించగానే, నీవు నిద్రా తమస్సులో మునిగిపోతావు.

భ - మనస్సు మేల్కొని వున్నపుడు చేసే అహంవృత్తి మూలాన్వేషణద్వారా, సూక్ష్మ కారణ శరీరాలుగా వున్న అహంతయొక్క జాడ తీయడం సాధ్యమా? ఆ రెండూ అగ్రాహ్యమైనవి కదా?

మ- సాధ్యమే. అహంవృత్తి మూలవిచారణ, అహంతయొక్క సద్రూపాన్ని తాకుతుంది. అందువల్ల అహంత ఏ ఆకృతిలో వున్నా, అది ఎంత సూక్ష్మమైనది అయినా అది ప్రధానాంశం కాదు.

భ - అపరిచ్ఛిన్న, నిరుపాధిక, శుద్ధ సద్రూపాత్మ సాక్షాత్కారం ఏకైక లక్ష్యమై వుంది. ఆ ఆత్మ అహంతపై ఆధారపడింది కాదు. అటువంటపుడు, అహంవృత్తి రూపంలో వున్న అహంతను గురించిన విచారణ, ఏ విధంగా ప్రయోజనకరం?

మ- వ్యవహారం దృష్ట్యా చూసినపుడు, అహంత, దాని స్వరూపం, దాని క్రియాకలాపాలు మొదలైనవాటినిబట్టి ఏ పేరుతో పిలిచినా, అది మాసిపోయేదే. అందుచేత ఏ పేరు పెట్టినా అది ముఖ్యం కాదు. అహంతకు ఒకే ఒక లక్షణం వుంది. 'అది శుద్ధ చిదాత్మకు, జడమైన దేహమునకు మధ్య ఒక గ్రంధి'గా వ్యవహరిస్తుంది. అందుకే అహంత "చిజ్జడ గ్రంధి" అని పిలువబడుతుంది. అహంవృత్తియొక్క మూలాన్ని గురించి చేసే విచారణలో, అహంతలోని చిదంశను నీవు గ్రహిస్తావు. తద్వారా ఆత్మవిచారణ, శుద్ధాత్మ చైతన్య సాక్షాత్కారమునకు దారి తీస్తుంది.

భ - జ్ఞాని సాక్షాత్కరింపచేసుకొనే 'శుద్ధచిత్తు'కూ, మౌలికంగా మన సకల అనుభవాల యొక్క ప్రాధమిక దత్తాంశంగా అంగీకరింపబడిన 'అహం స్ఫురణ'కూ (నేను వున్నాను) మధ్య వుండే సంబంధం ఏమిటి?

మ - అవ్యాకృతమైన శుద్ధ చిద్రూపం అనేది "హృదయం." అదే నీవు. ఆ శబ్దం తెలియజేసేది అదే. (హృత్ + అయం = హృదయమే నేను). హృదయం నుండి 'నేను వున్నాను' (అహం స్ఫురణ) అనేది నీ అనుభవాలన్నింటి మౌలికమైన దత్తాంశంగా పైకి లేస్తుంది. సహజసిద్ధంగా అది శుద్ధసత్త్వ రూపంలో వుంటుంది. ఈ శుద్ధసత్త్వ స్వరూపంలో (అంటే రజస్తమములచేత దూషితం కాకుండా) 'నేను' భావన జ్ఞానిలో నిలిచి వుంటుంది

భ - జ్ఞానిలో అహంత సాత్త్విక రూపంలో వుంటుంది. అందువల్ల అది సన్మాత్రంగా తోస్తుంది. అవునా?

మ - లేదు. అహంత ఏ రూపంలో వున్నా, జ్ఞానిలో అయినా అజ్ఞానిలో అయినా దాని ఉనికి ఆభాస మాత్రమే. 'జాగ్రదవస్థ, జగత్తు సత్యము' అనే భ్రాంతిలో వుండే అజ్ఞానికి, అహంత కూడా సత్యంగా తోస్తుంది. జ్ఞాని కూడా ఇతరులవలె వ్యవహరించడం చూసి, అజ్ఞాని జ్ఞానికి కూడా ఏదో ఒక రకమైన వ్యక్తిత్వాన్ని అంటగట్టాలనుకుంటాడు.

భ - అయితే జ్ఞానిలో అహంవృత్తి ఎలా పనిచేస్తుంది?

మ- అతనిలో అది అసలు పని చేయదు. జ్ఞానియొక్క లక్ష్యం హృదయమే. జ్ఞాని ఉపనిషత్తులలో 'ప్రజ్ఞానం' అని పేర్కొనబడిన అవ్యాకృత శుద్ధచిత్ స్వరూపంతో తాదాత్మ్యం చెంది వుంటాడు. "ప్రజ్ఞానం" అంటే బ్రహ్మము. ప్రజ్ఞానం కంటే వేరైన బ్రహ్మం లేదు.

భ - అద్వితీయ సత్యమును గురించిన మరపు, అజ్ఞానికి ఎలా ఏర్పడింది? ఇది దురదృష్టమే!

మ- మనస్సు హృదయంలో నుండి లేస్తుంది. అది శుద్ధ చితి ప్రకాశ ప్రతిఫలన మాత్రం. అజ్ఞాని, ఆ మనస్సును మాత్రమే చూస్తాడు. హృదయాన్ని గురించి అతనికి తెలియదు. ఎందువలనంటే, అతని మనస్సు బహిర్ముఖమై వుంటుంది. అది దాని మూలాన్ని కనుగొనాలని ప్రయత్నించదు.

భ - హృదయంలో నుండి వచ్చే ఆ అనంత అవ్యాకృత చితప్రకాశం, అజ్ఞానికి సాక్షాత్కరించేందుకు ఆటంకంగా వున్నది ఏమిటి?

మ- పరిమితమైన పాత్రలో వున్న నీటిలో, అపరిమితమైన సూర్యుడు ప్రతిబింబిస్తాడు. అలాగే మనిషి మనస్సులోని వాసనలు, అద్దంలాగా పని చేస్తాయి. వానిలో హృదయం నుండి లేచే, సర్వవ్యాపక అనంత చిత్ర ప్రకాశం మనోరూపంగా ప్రతిఫలిస్తుంది. ఈ చిత్ప్రతిబింబాన్ని చూసి అజ్ఞాని, 'తాను జీవుడు' అనే భ్రాంతికి లోను అవుతాడు.

అహంవృత్తి మూలాన్ని విచారణ చేయడం ద్వారా, మనస్సు అంతర్ముఖం అవుతుంది. దానితో వాసనలు నశిస్తాయి. ప్రతిఫలింపచేసే సాధనం లేకపోతే, ప్రతిబింబ మాత్రమైన ఈ మనస్సు కూడా లేకుండా పోతుంది. ప్రకాశ స్వరూపమైన, కేవల సత్యమైన హృదయంలో విలీనమైపోతుంది.

సాధకుడైనవాడు తెలుసుకోవలసినది ఏదైనా వుంటే, అదంతా ఇదొక్కటే. ఇక అహంవృత్తి మూలాన్ని గురించి శ్రద్ధతో, ఏకాగ్రచిత్తుడై విచారణ చేయడమే అతని కర్తవ్యం.

భ - కానీ, అతని యావత్ ప్రయత్నమూ జాగ్రదావస్థకే పరిమితమై వుంటుంది. మనస్సుయొక్క అవస్థాత్రయములోని ఒక అవస్థకు పరిమితమైన ఈ విచారణ, మనస్సు అంతటినీ ఎలా నశింపచేయగలుగుతుంది?

మ - అహంవృత్తి మూలవిచారణ, జాగ్రదవస్థలోనే ఆరంభమవుతుంది. వాస్తవమే. అతనిలో మనస్సు నశించినదని చెప్పలేము. అయితే, ఆత్మవిచార ప్రక్రియ కారణంగా, మనస్సుకు సంబంధించిన మూడు అవస్థలూ, అవి పర్యాయక్రమంగా రావడం, పరస్పరం పరివర్తనం చెందడం - ఇవన్నీ విషయ ప్రపంచానికి చెందినవే అని తెలుస్తుంది. దీనివల్ల సాధకుడు చేసే తీవ్ర అంతర్విచారణకు భంగం వాటిల్లదు.

మనస్సు బాగా అంతర్ముఖమైతే, ఆత్మవిచారణ సాధ్యపడుతుంది. అహంస్మృత్తి మూలాన్ని గురించి విచారణ చేయడం వలన, అవ్యాకృత శుద్ధచిత్ స్వరూప ప్రకాశంగా హృదయం సాక్షాత్కరిస్తుంది. అందులో ప్రతిబింబిత మనస్సుయొక్క ప్రకాశం పూర్తిగా విలీనమైపోతుంది.

భ - జ్ఞాని దృష్టికి అవస్థాత్రయములో ఏమీ తేడా గోచరించదా?

మ- ఎలా వుంటుంది? మనస్సే చిత్రప్రకాశ రూపంలో మునిగి, మాయమై నశిస్తే? జ్ఞానికి మూడు అవస్థలూ మిథ్యయే. అజ్ఞాని దీనిని గ్రహించలేడు. అతనికి ప్రమాణము జాగ్రదవస్థ. జ్ఞానికి ప్రమాణం స్వరూపమే. ఈ విశుద్ధ చిత్స్వరూపం నిత్యమైనది. అందువలన జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలలో అది ఒకే విధంగా నిలిచి వుంటుంది. స్వరూపప్రాప్తి అయినవానికి మనస్సు లేదు, దాని అవస్థాత్రయమూ లేదు. అందువలన అంతర్ముఖత్వమూ లేదు, బహిర్ముఖత్వమూ లేదు.

నిత్యాత్మను గురించిన ఎరుక వుంది కాబట్టి, అతనిది 'నిత్యజాగ్రత్తు.' జగత్తు మాటిమాటికి వచ్చిపోయే స్వప్నంవంటిది కాబట్టి, అతనిది 'నిత్యస్వప్నము. ' ఎల్లపుడూ దేహాత్మభావనా శూన్యుడై వుంటాడు కాబట్టి, అతనిది 'నిత్యసుషుప్తి.'

భ - అయితే శ్రీభగవాన్ జాగ్రత్ -స్వప్న-సుషుప్తి దశలో వుండి, నాతో మాట్లాడుతున్నట్లు భావించవలెనా?

మ - జ్ఞప్తితో కూడిన ఇప్పటి నీ అనుభవం, మనస్సు ఇపుడు బహిర్ముఖమై వున్న కాలానికే పరిమితమై వున్నందున, ప్రస్తుత దశను నీవు "జాగ్రదవస్థ" అంటున్నావు. కానీ, నిజానికి నీ మనస్సు, ఆత్మ విషయంలో నిద్రిస్తూనే వుంది. కనుక నీవు ఇపుడు కూడా గాఢసుషుప్తిలోనే వున్నావు.

భ - నాకు నిద్ర ఒక శూన్యస్థితి.

మ - జాగ్రదవస్థ వ్యాపారాత్మక మనోవిజృంభణం. అందువల్ల నీకు అలా తోస్తుంది.

భ - నిద్రలో నేను ఏమీ ఎరుగను. 'శూన్యం' అంటే నా భావం ఇది. అంటే నా వరకు నాకు అది లేనిదాని క్రిందే లెక్క.

మ- కానీ, నిద్రలో నీవు వుండనే వున్నావు.

భ - నేను వుంటే, నా ఉనికిని గురించిన ఎరుక నాకు లేదు.

మ- నిద్రలో నీవు లేకుండా పోయావని, నిజంగానే నీ అభిప్రాయమా? (నవ్వు) 'అ'గా నిద్రపోయిన నీవు, 'క్ష'గా నిద్ర లేచావా?

భ - నా వ్యక్తిత్వం నాకు తెలుసు, బహుశ నా స్మృతి కారణంగా కావచ్చు.

మ - దానిని నీవు అంగీకరించినప్పటికీ, ఎరుక అనేది అవిచ్ఛిన్నంగా వుండకపోతే, స్మృతి ఎలా సాధ్యమవుతుంది?

భ - కానీ, నేను ఆ ఎరుకను ఎరుగను.

మ - లేదు. నిద్రలో 'నీవు ఎరుగవు?' అని చెప్పేది ఎవరు? నీ మనస్సు. కానీ, నిద్రలో నీకు మనస్సు లేదు. నిద్రలో నీ అస్తిత్వాన్ని గురించి, నీ అనుభవాన్ని గురించి తెలియజేసేందుకు, (నిద్రలో లేని ఆ) మనస్సుయొక్క సాక్ష్యం ఎలా పనికి వస్తుంది? నిద్రలో నీ ఉనికి లేదనీ, నీకు ఎరుక లేదనీ ఋజువు పరచేందుకై, మనస్సును ప్రమాణంగా పెట్టుకోవడం అంటే, నీవు పుట్టలేదని ఋజువు పరచేందుకై, నీ పుత్రుడిని సాక్ష్యంగా పెట్టుకోవడం వంటిది.

నేను లోగడ చెప్పాను. జ్ఞాపకం వుందా? 'ఉనికి, ఎరుక' అనేవి రెండు భిన్న తత్త్వములు కాదు. రెండూ ఒకటే. సరే, ఒకపేళ ఏ కారణం చేతనైనా నిద్రలో నీవు వున్నావని ఒప్పుకోవడం, నీకు తప్పనిసరి అయిందనుకో. అపుడు ఖాయంగా నీవు ఆ ఉనికిని ఎరిగి వుంటావు కూడా. నిద్రలో నీకు నీ దేహంయొక్క ఉనికి తెలియదు. అంతే. నీవు దేహ స్ఫురణను నిత్యాత్మ స్ఫురణగా భ్రమించి, పొరబడుతున్నావు. 'అస్మిత' లేదా 'అహం' స్ఫురణకు మూలమైనది ప్రజ్ఞానము. అది వచ్చిపోయే అవస్థాత్రయము వలన ప్రభావితం కాదు. ఆ ప్రజ్ఞానం స్థిరంగా నిలిచి వుంటుంది. ఆ కారణం వలన నీ వ్యక్తిత్వాన్ని సడలిపోకుండా, నీవు నిలబెట్టుకోగలుగుతావు.

'ప్రజ్ఞానం' అవస్థాత్రయాతీతమైంది. అవి వున్నా, లేకపోయినా అది స్వతంత్రంగా నిలిచి వుంటుంది.

ఆ పరతత్త్వాన్నే 'జాగ్రత్' అని పిలువబడే దశలో, నీవు అన్వేషించాలి. అందుకొరకు అహంవృత్తి మూలానికి పెళ్ళి, దాని ఆచూకీ తీయాలి. ఈ విచారణ రూపంలో చేసే తీవ్రాభ్యాసం వలన "మనస్సు, దాని మూడవస్థలు అసత్యములు' అని, 'నీవు శుద్ధ సత్స్వరూప నిత్యానంద చిన్మాత్రుడవు' అని, 'ఆత్మ లేదా హృదయం నీ స్వస్వరూపం" అని సాక్షాత్కారం అవుతుంది.

శ్రీరమణార్పణమస్తు

అనుబంధం భగవాన్ శ్రీరమణ మహర్షి

శ్రీస్వామి సిద్ధేశ్వరానంద

('శ్రీస్వామి సిద్ధేశ్వరానంద' వేదాంతంలో నిష్ణాతుడైన పండితుడు, శ్రీరామకృష్ణ మిషన్లో సుప్రసిద్ధుడు, మిషన్‌యొక్క పారిస్ శాఖకు అధిపతి. భారత దేశంలో వుండగా, ఆయన ఆశ్రమానికి తరచు వచ్చేవారు. భగవాన్ శ్రీరమణ మహర్షి పట్ల అకుంఠిత భక్తి కలిగిన వ్యక్తి. 'సకల జగత్తూ తానే అయిన సర్వాత్మగా, పరతత్త్వముయొక్క సజీవ అవతారం'గా భగవాన్ను ఆయన ఆరాధించేవారు. ఫ్రెంచ్ భాషలో ఆయన భగవాన్ పై ఒక వ్యాసం వ్రాసారు. దానిని మేజర్ ఎ. డబ్ల్యూ. చాడ్విక్, ఒ.బి.ఇ., ఆంగ్ల భాషలోకి అనువదించాడు. ఆ వ్యాసానికి ఇది సంక్షిప్త పాఠం.)

భగవాన్ శ్రీరమణ మహర్షి వేదాంత బోధలకు సారభూతమైన ఒక ఆలోచనా విధానాన్ని, ఒక జీవన దర్శనాన్ని ప్రతిపాదించారు. భారతదేశంలో ఏ జీవన దర్శనమైనా, దానిని ప్రతిపాదించిన వ్యక్తియొక్క జీవితంలో అది ప్రతిబింబించక

పోతే, తన ప్రభావాన్ని ఏమాత్రం చూపలేదు. ఇంకో విషయం కూడా చెప్పవలసి వుంది. ఒక వ్యక్తియొక్క జీవితం, ఆయన పొందిన అనుభవాలు ఒక దర్శనాన్ని నిర్మించేందుకు అవకాశాన్ని కల్పిస్తాయి. అటువంటి జీవితం జనులలో, సమ్యక్ అవగాహనను తీసుకొని వచ్చి, యావత్ సమాజాన్ని ప్రభావితం చేసి, వ్యక్తుల మధ్య పరస్పర సంబంధాలను మెరుగుపర్చగలిగే దృక్పథాన్ని గోచరింపచేస్తుంది.

ప్రాచీన భారతదేశంలో ఋషులు అంతిమ సత్యాలను సాక్షాత్కరింప చేసుకున్నారు. వేదమంత్రోచ్చారణద్వారా, ఉపనిషత్ బోధలద్వారా వారు ఆ సత్యాలను వెల్లడించారు. వారిని లోకం "మహాత్ములు" అని సంభావించింది. జీవన యాత్రలో తొట్రుపడుతున్న మానవాళికి, మార్గదర్శనం చేసే దీపస్తంభాలుగా వారు వెలుగొందారు. వారు సాక్షాత్కరింప చేసుకొన్న సత్యాలు, వారి ఆత్మలో నిక్షిప్తమై వున్నాయి. వారు జనులకు బోధించేది ఒకటే: "అందరిలోను అమూల్యమైన రహస్య నిధి ఒకటి దాగి వుంది. దానిని వెలుపలికి తీసేందుకు మనిషి తనలోకి తాను చొచ్చుకుపోవాలి." అందుకోసం అనుసరించదగిన మార్గాన్ని వారు బోధిస్తారు. ఆ 'పరమ సత్యము' మనందరికి వారసత్వంగా లభించి వుంది. అందువల్ల తనకు తాను అంతర్వీక్షణ చేసుకొనే హక్కు, ప్రతి మనిషికీ వుంది. దాని వలనే మనిషి చేసే ప్రయత్నాలకు ఘనత చేకూరుతుంది.

సత్యసందర్శనాభిలాషులైన వారందరినీ ఉద్దేశించి ఉపనిషత్తులు, 'అమృతస్య పుత్రాః' అని సంబోధించాయి. ఆశావహమైన ఈ మాటలకంటే మించిన ధైర్య వచనాలు మరేం వుంటాయి? 'తన అస్తిత్వానికి మూలం ఆదిమ పాపంలోగాక, ఆత్మప్రకాశపు స్వర్ణకాంతులలో వున్నద'ని మానవుడు వీటిద్వారా కనుగొంటాడు.

మహర్షి దీనిని కనుగొన్నారు. తమంతట తాముగా, బాహ్య సహకారం ఏమీ లేకుండానే సందర్శించారు. తొలిదశలో విద్యార్థిగా వున్నపుడే, ఆయనకు మృత్యుభయం పైకొన్నది. అప్పుడు అతడు పుస్తకాలు అవతల పారవేసాడు. 'అవి సత్యాన్ని తెరచి చూసే బదులు, మూసిపెడతాయి' అని గ్రహించాడు. అతను ఒకనాడు వెల్లకిల పడుకున్నాడు. కళ్ళు మూసుకున్నాడు. మృత్యు లక్షణాలన్నింటినీ తనపై ఆవహింప చేసుకున్నాడు.

తమ మృత్యు అనుభవాన్ని గురించి, వారు స్వయంగా చెప్పిన మాటలు ఇలా వున్నాయి:

“ఇపుడు మృత్యువు వచ్చింది. దాని అర్థం ఏమిటి? చనిపోయేది ఏమిటి? ఈ భౌతిక శరీరం మరణిస్తుంది. అంతట నేను మృత్యుదృశ్యాన్ని నాటకీకరించు కున్నాను. నా అవయవాలను చాపి, బిగించాను. శ్వాసను నిలిపాను. ఇలా అనుకున్నాను: 'మంచిది, ఈ దేహం మరణించింది. అందరూ వచ్చి దానిని స్మశానానికి తీసుకొని వెళతారు. బూడిద చేస్తారు. అయితే దేహం మరణిస్తే, నేను మరణించానా? ఈ దేహం నేనా? ఇది జడమైంది. దీనికి అతీతంగా, నా వ్యక్తిత్వ స్ఫురణ నాకు కలుగుతోంది. అందువల్ల పుట్టి, గిట్టే ఈ శరీరాన్ని అధిగమించి వున్న నేను అమరమైన ఆత్మను. ఇదంతా నాముందు అతి తీవ్రంగా ఏ వాదంయొక్క అవసరం లేకుండా, మాటలలో వ్యక్తీకరించే అవసరం లేకుండా, తత్కాలంలో ఒక సజీవ సత్యంగా గోచరించింది. మృత్యుభయం సంపూర్ణంగా, నిశ్చయంగా మాయమైపోయింది. ఆ క్షణం నుండి భౌతిక శరీరానికి పూర్తి అతీతంగా 'నేను' యొక్క సద్యస్సన్నిధి, సచేతన కొనసాగింది.”

ఆత్మయొక్క ఈ ప్రత్యక్షానుభవాన్ని “అపరోక్షానుభూతి" అంటారు. బుద్ధి సాయంతో పొందిన ఇంద్రియ జ్ఞానంకంటే ఇది విలక్షణమైంది. పరోక్షమైన బౌద్ధిక జ్ఞానం, దృక్ దృశ్య సంబంధంయొక్క ప్రమేయం వలన దేశకాల పరిచ్ఛిన్నమై వుంటుంది. దానికి పారమార్థిక ప్రయోజనం వుండదు.

ఇలా అపరోక్షంగా ఆత్మానుభవ ప్రాప్తి అయినవారిని, జీవించి వుండగానే ముక్తులైనవారిని “జీవన్ముక్తులు" అంటారు. ఇటువంటి వ్యక్తులు పరమ సత్యానికి సజీవ మూర్తులుగా వుండి, ఆ సత్యమును నిరూపించదగిందిగా చేస్తారు. ఈ మహాత్ముల వేదాంతానుభవం వలన, అది ఆచరణ సాధ్యమైందే అని తెలుస్తుంది. వారికి కలిగిన సాక్షాత్కారం వలన, మానవ చైతన్యస్థాయి పెరుగుతుంది.

వేదాంతంలోని ఈ దృక్కోణమే, విద్వాంసులైనవారి దృష్టిని వేదాంత బోధల వైపు ఆకర్షించింది. 'వేదాంత విచారణ' బాహ్య పదార్థ విశ్లేషణకన్నా ఇంకా ఎంతో లోతుల్లోకి పోతుంది. విషయ గ్రహణంయొక్క మూలాధారంలోకి వెళ్ళి, పరమార్థ

సారాన్ని మనకు అందిస్తుంది. ఖండదృష్టిని కాదు. శ్రీరమణ మహర్షి జీవితం పట్ల, వారి బోధల పట్ల పాశ్చాత్యులు ఆసక్తి కనబరుస్తున్నారు. వేదాంతానికి వున్న విశజనీనమైన ఆకర్షణకు ఇది ఋజువు. అరుణాచల మహర్షిలో, మూర్తీభవించిన ఈ వేదాంత తత్త్వమే కనిపిస్తుంది."

భారతీయ యోగాన్ని గురించి వ్రాసిన ఒక వ్యాసంలో, పారిస్ విశ్వ విద్యాలయానికి చెందిన 'యం. లాకోమ్' మహర్షిని గురించి ఇలా వ్రాసాడు:

"మహర్షి దేహం నుండి, ఆత్మ జయం వలన ఏర్పడిన జ్ఞానశక్తి తరంగములు ప్రసరిస్తున్నాయి. మెరుపువలె తళుక్కుమనే వారి కన్నులు, తీక్షణత, మెత్తన కలబోసుకున్న వారి స్థిర శాంతదృక్కులు, సుకుమారం, నిశ్చలం అయిన వారి దుర్బల శరీరం, గాంభీర్యం, మృదుత్వములతో కూడిన వారి అవయవ చాలనము - ఇవి చూసినవారికి ఆయన ఒక మహాయోగిగా భాసించేవారు. అత్యుత్తమ పరీక్షకులైనవారు కూడ, వారిని చూసి 'ఆత్మసాక్షాత్కార స్థితిని చేరుకున్న యోగి'గా తేల్చి చెప్పారు."

మహర్షిని పరివేష్టించి వున్న ఆధ్యాత్మిక వాతావరణాన్ని గ్రహించగల వ్యక్తి, ఒక్కసారి ఆ సన్నిధికి రాగానే, ఎలాంటి ప్రభావానికి లోనయ్యాడో, తెలియ చేయటానికి ఈ వ్యాసభాగాన్ని ఉదహరించాను.

కానీ పాశ్చాత్య తత్త్వశాస్త్రంద్వారా, అక్కడి మతధర్మశాస్త్రంద్వారా మలచబడ్డ ఒక యూరోపియన్కు, మహర్షి జీవితాన్ని గురించిన సరైన అవగాహన వుండదు. ఆ పండితవర్యునికి వినయ పూర్వకంగా ఒక అంశాన్ని నేను తెలియపరచాలి: “ఆ మహర్షిని యోగి అనడంకంటే, 'తత్త్వజ్ఞాని' అనడమే సమంజసం. జ్ఞానిదృష్టి సమస్త జీవనాన్ని స్పృశిస్తుంది. అనగా జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలు మూడింటినీ స్పృశిస్తుంది. విశ్వాత్మతో తాదాత్మ్యం చెందడమే, 'యోగసిద్ధి.' అయితే యోగసిద్ధికి, జాగ్రదవస్థ ప్రధానమైన అనుభవ క్షేత్రంగా వుంటుంది. ఇలా యం. లాకోమ్ పేర్కొన్న విశ్వాత్మ భావమును పొందిన సిద్ధపురుషులకు, భారత దేశంలో కొరత లేదు. ఈ అనుభవం ప్రాతిపదికగా, తగినంత స్థాయిలో సిద్ధి పొందినవారు చాలామంది వున్నారు."

కానీ, మహర్షి ప్రధానంగా ఒక తత్త్వజ్ఞాని. వారి అన్వేషణకు, వారి అనుభవానికి స్వీకరించిన క్షేత్రం, సిద్ధులు ఎంచుకున్నదానికంటే ఎంతో గొప్పది, వున్నతమైంది. ఋషి అయినవాడు అవస్థాత్రయాన్ని దాటిపోతాడు.

ఉపనిషత్కాలం నుండి భారతీయ ఋషులు స్వీకరించింది, సంప్రదాయ సిద్ధంగా వచ్చింది అయిన పరిభాషను మహర్షి ఆమోదిస్తారు.

మహర్షి బోధలు ప్రాచీన భారతీయ దార్శనిక ఆధ్యాత్మిక శాస్త్రాలకు అనుగుణంగా ప్రాచీన ఋషిపరంపరాగతమైనవిగా వుంటాయి.

స్వయంగా పరిశీలించే అవకాశం కలిగిన ప్రతి ఒక్కరికీ ఒక విషయం తెలుసు. మహర్షి 'బహిర్ముఖులూ' కాదు, 'అంతర్ముఖులూ' కాదు. మనం చూసినంతలో, అత్యంత సాధారణమైన వ్యక్తిగా తోచినా, ఆయన ఒక “స్థితప్రజ్ఞుడు.” అనగా బుద్ధి స్థిరంగా నెలకొని వున్నవాడు. వారు తమలో తాము మునిగి వున్నట్లు నాకు తోచేది. అందరూ వారు ఆత్మస్థితులై వున్నారని తలచేవారు. అయితే ఆ క్షణంలో, హాలు చివర కూర్చుని వున్న వ్యక్తి ఎవరో, తమిళ పద్యాలు పారాయణం చేస్తూ తప్పు చదివాడు. మహర్షి కళ్ళు తెరచి ఆ తప్పును సరిదిద్ది, మరల కళ్ళు మూసుకొని పూర్వస్థితిలోకి వెళ్ళిపోయేవారు. నేను పైన చెప్పినట్లుగా, 'బాహ్యప్రపంచంలోని విషయాలు ఆయనకు పట్టనే పట్టవు' అని మనం చెప్పలేము. ఆయన ఒక అసాధారణమైన ఏకాగ్రస్థితిని పొందారు. ఆ ఏకాగ్రత, నిరంతరం జీవిత అభ్యస్తమై వున్న జ్ఞానంగా- మహర్షి చెప్పినట్లు - సహజస్థితిగా పర్యవస్థితమై వుండేది. అందువల్ల, ఆయన స్థితి బహిర్ముఖత్వమూ కాదు, అంతర్ముఖత్వమూ కాదు. ఆయన మామూలుగా 'వున్నాడు', అంతే. ఆయన తనకున్న పరమార్థ తత్త్వదర్శనం వలన పరమాత్మతో ఒకటై, సృష్టి అనేకత్వ అభివ్యక్తిలో సమస్త విశ్వంలోను ఒకటై వున్నారు.

వారిని సందర్శించినపుడు, 'వివేక చూడామణి'లో శ్రీశంకరాచార్యులవారు జీవన్ముక్తుడిని గురించి చేసిన వర్ణనకు, అద్వితీయమైన దృష్టాంతాన్ని నేను చూసాను. ఆ గ్రంథంలోని 429వ శ్లోకంలో జీవన్ముక్తుని లక్షణాలు ఇలా వర్ణించబడ్డాయి.

లీన ధీరపి జాగర్తి యోజాగ్రద్ధర్మ వర్జితః ।
బోధో నిర్వాసనోయస్య స జీవన్ముక్త ఇష్యతే ॥430 గీత ప్రెస్

'ఎవని మనస్సు బ్రహ్మములో లీనమై వుండి కూడా, జాగ్రదవస్థలోనే వుంటుందో; అలా జాగ్రదావస్థలో వున్నా కూడా, జాగ్రదవస్థయొక్క లక్షణాలను కలిగి వుండదో; ఎవనికి జ్ఞానం సిద్ధించిన కారణంగా, సకల వాసనల నుండి విముక్తి లభించదో; అటువంటివాడు “జీవన్ముక్తుడు.”

ఎవని జీవన దర్శనం, జాగ్రదనుభవాలపై ఒక విలక్షణమైన రీతిలో ఆధారపడి వుంటుందో, అటువంటి మహాత్ముని విషయంలో 'అంతర్ముఖత్వం, బహిర్ముఖత్వం' అనేవి అన్వయించవు.

అద్వైత శాస్త్రంలో ప్రామాణిక గ్రంథమైన 'పంచదశి'లోని 6వ అధ్యాయం, 13వ శ్లోకంలో ఈ అంశంపైన విద్యారణ్యస్వామి, అతి ముఖ్యమైన వివరణ ఇచ్చారు.

నా ప్రతీతి స్తయోర్బాధః కింతు మిథ్యాత్వ నిశ్చయః| నో చేత్సుషుప్తి మూర్చాదౌ ముచ్యే తాయత్నతో జనః ॥78

"జీవజగత్తులు నశించడం' అంటే, అవి ఇంద్రియ గోచరములు కాకపోవడం కాదు, 'అవి అసత్య మాత్రములు' అనే నిశ్చయ జ్ఞానం కలగడం. అలా కాకపోతే, ఏ పురుష ప్రయత్నం లేకుండానే, జనులకు గాఢనిద్ర, మూర్ఛలలో (ఎపుడు సమస్త విషయ గ్రహణము పూర్తిగా అదృశ్యమవుతుందో) ముక్తి లభించవలసి వుంటుంది."

గీతలో చెప్పినట్లు, "ఆత్మ, తన స్వభావమును మరచి, 'తాను అహంతను" అని భ్రమిస్తోంది. మిథ్యాజ్ఞానానికి అదే కారణం. అహంతను అధిగమించిన మహర్షిలాంటి వ్యక్తి, “సర్వభూతాంతరాత్ముడు" అని ఉపనిషత్తులు వర్ణించాయి. మహర్షి చెంత కొంతసేపు మనం గడిపినట్లు అయితే, తాత్త్విక సమస్యలను గురించి ఆ జ్ఞాని చెప్పిన మాటల నేపథ్యంలో, మనకు మరింతగా అవగాహన ఏర్పడుతుంది.

జ్ఞానియొక్క జీవితం, అరుణగిరిపై వెలిగే జ్యోతివలె, ఒక దీపస్తంభంగా నిలిచి వుంటుంది. దానిద్వారా, ప్రాచీన కాలం మనకు ప్రసాదించిన ఉపనిషత్ బోధల యొక్క పునరుజ్జీవనాన్ని, ఆధునిక భారతదేశంలో మనం దర్శించవచ్చు.

ఓం తత్సత్

భగవాన్ చేతివ్రాత

ఈశోగురురపిచాత్మారమణో దద్యాన్ముక్తిం తత్కరుణై వ ॥ భజభగవంతంరమణంకాంతం! పరమాత్మానం మానసనిత్యం॥

తా|| ఈశ్వరుడు, గురువు, ఆత్మ కూడ రమణుడే. ఆయన దయయే ముక్తిని ఇచ్చును. ఓ మనసా! పరమాత్మ, మనోహరుడు (సర్వజీవులకు అధిపతి) అగు భగవంతుడు అయిన రమణుని నిత్యం సేవింపుము.

# మహర్షి బోధ

భక్తులు అప్పుడప్పుడు అడిగిన ప్రశ్నలకు భగవాన్ శ్రీ రమణమహర్షి జవాబులు చెప్పేవారు. వానిలో కొన్ని 'మహర్షి బోధ' (Maharshi's Gospel) అనే ఈ గ్రంథరూపంలో ప్రచురింపబడ్డాయి. భగవాన్ భక్తులలో బహుసంఖ్యాకుల అభీష్టం మేరకు ఈ ముద్రణ జరిగింది. ఈ గ్రంథం అందరికీ ఉపయుక్తంగా ఉండగలదు.



www.sriramanamaharshi.org
ISBN 978-81-8288-040-5